# ఆర్యగృహిణి

కర్త

పం॥ మదన మోహన విద్యాసాగర్

అనుకర్తలు

ముమ్మన్నేని లక్ష్మీనారాయణ

పం॥ గోపదేవ్

ప్రకాశకులు

ఆర్యసమాజము, కూచిపూడి

౧౯౭౦

# పెండ్లి కానుక

వధువు:  వరుడు:

నవదంపతులారా!

మీరు పుట్టువు గన్నది కమ్మతావులు గుబాళించు కమ్మవంగడము. పెంపకము పొందినది అనుభవజ్ఞులగు తలిదండ్రుల ప్రాపున! గడపినది అవ్యక్త మధురములు; బాధ్యతా శూన్యములు నగు బాల్య బ్రహ్మచర్యములు. నేర్చినది సంప్రదాయానుగతమగు సాటిలేని భవ్య కళాపరిచితి.

అడుగిడబోవునది ప్రణయసుధాతరంగితము, మధుర కఠినసమస్యాసంఘృష్టము, బాధ్యతా పరిపూర్ణమునగు గార్హస్థ్యము. ఇందు పరస్పరము మీకు మీరే శిక్షకులు; ఒడుదుడుకులు పొరయకుండ మీ జీవితములు చక్కదిద్దుకొనవలసిన వారు మీరే! మీకు మీరే బాధ్యులు!

అఖండప్రణయలీలా వాల్లభ్యముల అనుభవింపుడు! సత్యసత్వసంపన్నులగు పుత్రపౌత్రులగాంచి ఆనందింపుడు! దేశకల్యాణవ్రతములు స్వీకరించి ఆదర్శదంపతులు కండు!

ప్రాచీన వైదికగార్హస్థ్య ప్రసవముల నేర్చి కూర్చిన "ఆర్యగృహిణీ" సురభిల కుసుమహారము దివ్యప్రణయోపహారమై మీ కంఠసీమల వెలారు గాక!

పరదైవ కరుణాకటాక్షములు సదా మీపై ప్రసరించుగాక!

కల్యాణవేది, రచయితలు.

# రెండు మాటలు

అమ్మాయీ! మానవులు గార్హస్థ్యమును గడపుటకు అతికుతుక పడుదురు; గాని అందలి లోతుపాతులను, ఓగుబాగులను లేశమాత్రముగ నేని పర్యాలోచింపరు. ఈ దాంపత్య జీవనమునకు చేరిన ముఖ్యవిషయ ములు నేర్చి కూర్చి ఒక కానుకగా నీవివాహ సుముహూర్తమునకు నందింప వలసినదని మీ జనకపాదులు ఆకాంక్షించియుండిరి. వారి ఆకాంక్షా ఫలితమే ఈ యాకృతిని దాల్చినది. దీనిముద్రణవ్యయ భారమును మీ తండ్రిగారే భరించియున్నారు.

ప్రియసోదరీ! నీవు గార్హస్థ్యమును ప్రవేశించుచున్నావు. అది నీకు సౌఖ్యప్రదముగా, ఆనందమయముగ పర్యవసింప వలయునను ఆకాంక్షతో, అతిమధురములు, రుచ్యములు, పక్వాపక్వములునగు వివిధఫలసంతతుల గూర్చి ఇదిగో! స్వర్ణ పాత్రికను నీ యెదుట నుంచుచున్నాను. దీనిలోగల ఫలములను నీవు అనుభవించుచు, మీ యిరుగు పొరుగువారికికూడ ఒక మారు చవిజూపుము. ఇది ఆర్యగృహిణికి ఆదర్శమగు సరణి. నాభావ ములను తెలుగున వ్యక్తము జేసికొనలేనందున శ్రీ పం॥ లక్ష్మీనారాయణ, పం॥ గోపదేవ్ గారలు నా యీ శ్రమను పంచుకొని ఉత్తమశైలితో, సరసముగ దీనిని పూర్తిగావించినందులకు వారికి నా ధన్యవాదములు.

పం॥ మదనమోహన విద్యాసాగర్.

# ఒకమాట

ఇది వైజ్ఞానిక యుగము. స్త్రీ పురుష భేదములేక ప్రతివారు అహమహమికతో విజ్ఞాన గవేషణమునకు ముందంజ వేయుచున్నారు. కాని మన నారీలోకపు స్థితిగతులు వేరు. వారు పురుషుల దృష్టిలో అతి హేయస్థానమును పొందియున్నారు. కాని వైదికయుగమునాటి ఆర్య గృహిణీమతల్లులవలె వీరిని గౌరవాదరములతో గాంచినగాని భారతీయ ప్రతిష్ఠ ప్రపంచ సీమలకు పరుగులెత్తజాలదు. "యత్ర నార్యస్తు పూజ్యంతే రమంతే తత్ర దేవతాః" అను పురామహర్షి ప్రవచనము సర్వతోముఖ ప్రచార బాహుళ్యమును పొందవలయును. అట్టి పవిత్ర సంకల్పమును హృదయగతము గావించుకొనియే శ్రీ జాస్తి వెంకటప్పయ్య, తులశమ్మలు ఈ గ్రంథమును ముద్రింపజేసి, నేటి నారీలోకమునకు మేలుగావించిరి. వీరు ఈ ప్రయత్నమువలన కేవల నారీలోకమునకేగాక వారి నంటిపెట్టుకొనియుండు, పురుషలోకమునకుగూడ వంద్యులగుచున్నారు.

అనుకర్తలు.

# విషయసూచిక



# ఆర్య గృహిణి

## ప్రథమ దళము

సోదరీ!

ప్రాత పలుకులని పరిహసింపకుము. ప్రాబలుకులలోని వసంత వయస్వినీ నవోచ్ఛ్వసిత సుమమరందములు జాల్వారు చున్నవి. అవి నీ జిహ్వాగ్రమున నెన్నడేని చిందెనా? చిందించుకొనుటకేనియు యత్నించితివా? పారతంత్ర్య నిగళ నియంత్రితమగు నీ భారతమాతృక పదయుగళమును స్వచ్ఛంద సంకలితముగ పొనరించి, పూజా శిరీషములు గైసేసి కొనజాలు యోధకుమారుల నుదయింపజేయు నో భారత పుత్రీ! నీకు ఆర్య వైదికజీవనధర్మ మొకించుక యెఱుక పఱచుట నాకును కొంతకుగొంత విహితకృత్యమని తలంపవా? తలంతువేని ఒకమారు చెవియొగ్గుము.

అదిగో! యజుర్వేద లలితలీలోపవనము. అందు ఘుమంఘుమలాడు ఋగ్లతాకుసుంగములమీది అమ్లాన భావసుమముల తిలకింపుము. నలుపదియవ పూవుటీగము

మీాది మలిపూవు చిదిమి ఆఘ్రాణింపుము. ఎట్లున్నది? ఇదిగో! "కుర్వన్నేవేహ కర్మాణి జిజీవిషేచ్ఛతగ్ంసమాః," ఇదియే కరుడుగట్టినదాని పరిమళత్వము. నూరేండ్లును సత్క్రియల నొనరించుచు బ్రతుకగోరుము. మఱియు దాని పరిమళ తరంగములలో మెరయు విద్యుల్లతికల కటాక్షించితివా? అవి ఈశ్వర స్తుతిగీతికలు. మొదటి మెరుపు "జీవేమ శరదశ్శతమ్." నూరేండ్లుజీవింతుముగాక! ఎందులకు? "ప్రబ్రవామ శరదశ్శతమ్" ప్రభూ! నీ విరచిత ప్రకృతి సౌందర్యమును నూరేండ్లదనుక నాలోకింతుముగాక! ఎట్లు? "శృణుయామ శరదశ్శతమ్" నూరేండ్లును త్వన్మాహాత్మ్యము నాలకించుచు, "అదీనాస్యామ శరదశ్శతమ్" జీవితపర్యంతము పరతంత్రులము గాకుందుముగాక!

అయి! స్నిగ్ధహృదయే! శతవత్సర పరిమితమై పారతంత్ర్యపరిహీణముగాని పురుషాయుష్యము చౌపాళ్ళుగా విభక్తమైనది. తొలిపాలు బ్రహ్మచర్యము. మలిపాలు సన్యాసము. రెండు - మూాళ్ళు గార్హస్థ్య - వానప్రస్థములు. ఈ నాలుగు ఆశ్రమములే కేవల మైందవోపల నాళికలు. వీని నుండియే ఆర్యవైదిక జీవనధారలు నిష్యందితములై నిన దించును. చెల్లీ! ఏకమనస్కవై ఒక్కొక నినద మాలింపుము!

బ్రహ్మచర్యము :— బ్రహ్మశబ్ద మేదియో ఒకరీతి సర్వజనులచే నితరా ముచ్చరితమై నిజపదార్థ జ్ఞానమున సామాన్యులకు అబోధకమగుచున్నది. ఇందులోని అక్షరములు సారెంది న తంత్రులవోలె మహోత్కృష్టములగు

పదార్థముల నాలుగింటిని వెలయించుచున్నవి. ఈశ్వరుడు, ప్రకృతి, తత్ జ్ఞాన బోధకమగు వేదము, దాని నెరుగుటకు అనువౌసగు వీర్యము బ్రహ్మశబ్ద పరిజ్ఞాతములగు మధురార్థ బిందువులు. ఈ నాలుగింటిని సాధించునట్టిదానికే బ్రహ్మచర్యాశ్రమ మని పేరు. వీర్య పరిరక్షణము మగువకుగాని మగవానికేని తులాతులితము. శారీరికోన్నతి – మానసికోన్నతి, ఆత్మికోన్నతులు మానవ గంతవ్యసిద్ధులలో మహోన్నతము లయినవి. ఇవి వీర్య పరిరక్షణము లేక లభింపవు. ఐకకంఠముగ దీనినిగూర్చి పురామహర్షు లనేకథా ప్రవచించిరి. రక్షణమునకు వలయు సాధనములు దీనికి మూడు కలవు. మనోవాక్కర్మలు సంస్కృతములు కావలయును. సకలేంద్రియములను సంయమింప వలయును. కనుగవకు చెడుదృశ్యములు తోపరాదు. అశ్లీల ప్రేమగీతికలు శ్రవఃపుటములకు సోకరాదు. మదోద్దీపకములగు కాముకామోదకములు సువాసింపరాదు. చుంబనాలింగనాదులకు నెడమీయరాదు. నిషిద్ధములగు మీాది కర్మలకు లోగినవాడు భోగలాలసుడై వీర్యపాలనమున వీగిపోవును. వీర్యపాలనాపరిచ్యుతికి భోగలాలసత ఉత్తేజకము. ఈ యుత్తేజము అధమగతికి మార్గదర్శి యగును. కావున సకలేంద్రియసంయమనమే బ్రహ్మచర్య పరిపూర్ణ పాలనము.

రసనేంద్రియ సంయమనముకూడ వీర్యరక్షణమునకు అమోఘ సాధనము. ఉద్దీపకపదార్థసేవనమున మానవునకు కామవాసన కలిగి పాపకర్మాచరణమునకు ప్రవృత్తి కలుగును. వీర్య మధోగతికి ప్రవహింపనీక మస్తిష్కము వంకకు నడుపు

కొనుటయే ఊర్ధ్వరేతస్కత యనబడును. అది సిద్ధించిన శరీరమునకు బలము, బుద్ధికి నైర్మల్యోదయము లభించును. రేతోవాహిక ఊర్ధ్వమునకు ప్రవహించి శరీరమున నంతర్లీనమై ఓజస్సుగ పరిణమించుటయే బ్రహ్మచర్యముయొక్క దివ్య సంపత్తి.

తనలో రేకెత్తిన శారీరిక, మానసిక, ఆత్మిక వికాసముతో - ఈశ్వర ప్రకృతుల జ్ఞానపరిలబ్ధితో విద్యాధ్యయనమునకు ప్రవృత్తమగుట ఈ ఆశ్రమమునకు ముఖ్యాంగము.

స్థూలదృష్టితో మనుష్యజీవన సౌధమున కిది పునాది. పునాదికి బిగితనములేక సౌధస్థితి యచలము కాదు. అట్లే అధ్యయన వ్యాసంగమున సముపార్జించిన జ్ఞానసంపత్తిను నిత్యక్రియాత్మక జీవనమున తన శరీరమున నైక్యముంజేయుటయ గృహస్థాశ్రమము. ఇక ఇందలి కరణీయ లీలామర్మలనో ఆర్యగృహిణీ! కొంచెము చవిజూడుము.

గృహస్థాశ్రమము:— వైవాహిక సూత్రబంధితులునై ధర్మపురస్సరముగ సంతానము బడయుట, వారిని విజ్ఞాన వికసితుల గావించి సమాజ సంస్కృతికి సమర్పించుట, పరోపకృతికి తన జీవనసర్వస్వమును పురుషార్థములతో వ్యతీతమొనరించుట, ధార్మికములు - లోకోపకారకములు నగు కర్మలలో తను - మన - ధనములు వ్యయించుట, లౌకిక - పారలౌకిక సుఖముల పరాకాష్ఠను జూరగొనుట గార్హస్థ్య దివ్య సౌధమునకు వివిధ విశాల రమణీయ మణి ప్రఘాణములు.

భారత పురంధ్రీ! ఇట్లు మోఘముకాని ఆత్మ వీర్య బలమునకు నుదాత్తచరితులగు పుత్రరత్నములను ప్రసవించి, అనర్ఘములగు దివ్యజ్ఞానజ్యోతులతో ప్రపంచసీమలను దేదీప్యమానమొనరించి, ధన్యతం జెందినపుడే మనుష్యుని రచనాకార్యము పరిసమాప్తమగును. సాంసారికానందానుభూతి పూర్ణసిద్ధినందిన పిమ్మట మూడవమెట్టగు వానప్రస్థమున మానవుడు ప్రవేశించును.

పవిత్రమూర్తీ! ప్రవృత్తి, నివృత్తి రూపములగు రెండు పథములు ఆర్యధర్మమునకు అంటుకొన్నాలు. ప్రవృత్తిలో మానవుడు భోగలాలసుడై విహరించును. నివృత్తి సర్వాంగతః తద్భిన్నము. ఇల్లు-వాకిలి వీడి, ప్రపంచముతో చిరకాలమునుండి ననలుపెనలుసాగి అంటియున్న స్నేహబంధమును ద్రెంపుకొనవలయును. బహిర్ముఖములగు నింద్రియముల నంతర్ముఖముల గావింపవలయును. గృహస్థాశ్రమమున మానవుని సకలేంద్రియములు ప్రభాతకాలమున దిగ్వలయములకు సమగ్ర సమున్మీలనోన్ముఖములగు సూర్యకిరణములవలె చెలరేగును. అట్టి వానిని సాయంసమయమున జరఠపతంగుడు తన కిరణజాలమును దిక్కులనుండి సమీకరించుకొనునట్లు మానవుడు వానప్రస్థమున ప్రవేశించినతోడనే తనలో నేకీకరించుకొనవలెను. వనభూములు చేరవలయును. వేదముల నభ్యసింపవలయును. అగ్నిహోత్రాదికర్మల నిర్వర్తింపవలయును. వీర్యమును రక్షించుకొని, ఉత్కృష్టమగు ఊర్ధ్వరేతస్కతను ప్రాపింపవలయును. సంయమసంయుతము, నిత్యకఠోరము నగు తపఃకార్యమున సమయము గతింప

వలయును. తనకు కలిగిన శిక్షతో నిష్కామభావముతో ప్రాణికోటికి సేవయు నుపకృతియు నొనరింపవలయును. గార్హస్థ్యమున పరిహీణములైన మానవశక్తులను పునరుజ్జీవింప జేసికొనుటయే వానప్రస్థము ప్రసాదించు సదవకాశభాగ్యము. ఇందు కృతార్థుడయిన మహావ్యక్తియే సన్యాసములోని నిబిడ సంఘర్షణమునకు సాహసించి నిలువగలడు. విలువ కనుగొన గలడు.

సన్యాసాశ్రమము :— ఇది చరమాశ్రమము. కామ్య కర్మల న్యాసమే సన్యాసము. కావుననే "కామ్యానాం కర్మ ణాం న్యాసం సన్యాసం కవయో విదుః" అని గీత శ్రుతపరచి నది. ఇందు మానవుని సకల వాంఛలు ఉడుగును. కర్మఫలాభి రుచులు నాశములగును. హృదయాంతరాళమున దివ్యజ్ఞాన జ్యోతి ప్రత్యక్షమగును. "జ్ఞానిన స్సర్వకర్మాణి భస్మ సాత్కురుతేఽర్జున!" అని గీత ఉద్ఘోషించినది. పరోప కారార్థమైనవి కాక అన్యములగు స్వార్థకర్మలనెల్ల జ్ఞానులు భస్మీకరించుకొందురు. పదార్థ చింతనమే జ్ఞానులకు విహిత కర్మ. సన్యాసి నైష్కర్మ్యి కాడు. ఆతని వ్యవసాయము కేవలము స్వార్థమునకొఱకుగాక లోకకల్యాణ సిద్ధికి సంబంధించి యుండును. "ఉదారచరితానాంతు వసుధైవ కుటుంబకమ్" అనునది వారిపట్ల యథార్థము. ప్రపంచ మతని పరివారము. ఆశ్రమముల ప్రతిష్ఠించి, మఠముల నిర్మించి, శిష్యపరంపర నుండి స్వర్ణవాహినుల స్వీకరింపడు. అతనికి ప్రపంచమున మమత్వబుద్ధి లేదు. తనచేయు కార్యముల "అహంమన్యత" బూనడు. తామరపాకుమీది నీటిచుక్కయట్లు ప్రపంచమున

అంటే అంటక మెలగును. సమాజ-జాతి-దేశ సముద్ధరణమే అతని సత్యసంకల్పము; నిత్యకృత్యము. ఆశ్రమవ్యవస్థలను సరియైనపద్ధతులపై నడపుచు, ఆత్మ-పరమాత్మలలో నిమగ్నుడై, ధర్మమనెడి అమరజ్యోతిని మానవహృదయవేదికపై నిరంతరము ప్రజ్వలింపచేయును.

ఈ ఆశ్రమముల నాలుగింట ప్రధానములు రెండు; సహాయకములు రెండు. గార్హస్థ్య సన్యాసములు ప్రధానములు. అందు తొలిది ఐహికసాధకము. మలిది పారలౌకిక సాధకము. గార్హస్థ్యమునకు వలయు సాధన సంపత్తును బ్రహ్మచర్యమును, సన్యాసమునకు వానప్రస్థమును నొసగును. ఈ నాలుగింటి మూలతత్త్వము సమాజమునకు సుఖసమృద్ధియు, పరిపూర్ణ వికాసమును లభింపజేయుటయ. వీనగల మూలరహస్యము మానవునకు అంతిమ ధ్యేయమగు మోక్ష పరిలబ్ధికి దారితీయుటయే.

ఆర్యగృహిణీ! ఆశ్రమముల నాల్గింటి ధర్మసారమును క్లుప్తముగ నాలించితివి; కాని గృహిణికి వలసిన గార్హస్థ్య ధర్మసారమును విపులముగ - వివరముగ నెరుగుట గృహిణీ ధర్మము; విధియు. ఆశ్రమము లన్నింట ఇది ముఖ్యతమము. మిగిలిన ఆశ్రమముల భరణపోషణములు గార్హస్థ్యముపై నాధారపడి యుండును. ఇదియే దీని శ్రేష్ఠతకు ప్రబల తార్కాణము. మనువు మొదలగు పురామహర్షులెల్లరు దీని ఉత్తమత్వమును ముక్తకంఠముగ ప్రవచించిరి.

చతుర్ణా మాశ్రమాణాంచ గార్హస్థ్యం శ్రేష్ఠ ముత్తమమ్

వా॥ రా॥ అ॥ కా॥ శ్లో॥ ౧౦౬

నాలుగు ఆశ్రమములలో గార్హస్థ్యము శ్రేష్ఠము - నుత్తమము నయినది—

యథా మాతర మాశ్రిత్య సర్వే జీవన్తి జంతవః
ఏవం గార్హస్థ్య మాశ్రిత్య వర్తంత ఇతరాశ్రమాః

మ॥ భా॥ శాం॥ ప॥ శ్లో॥ ౨౬౯

జనని నాశ్రయించి సర్వజంతువులు కడుపులోని నీరు కదలకుండ జీవించునట్లు సకలాశ్రమములు గార్హస్థ్యము నాశ్రయించి సమ్యక్ప్రవృత్తము లగుచున్నవి.

సర్వేషా మపి చైతేషాం వేదస్మృతి విధానతః
గృహస్థ ఉచ్యతే శ్రేష్ఠః స త్రీ నేతాన్బిభర్తి హి

మనుస్మృతి అ॥ ౬॥ శ్లో॥ ౮౯

బ్రహ్మచర్యము-వానప్రస్థము-సన్యాసముల మూఁడింటిని గార్హస్థ్యము భరించియుండును. కావున శ్రుతి-స్మృతులు దీనినే నాలుగు ఆశ్రమములందు శ్రేష్ఠవత్తరము ప్రధానము నని ప్రవచించుచున్నవి.

సమగ్ర విద్యాబలములు, మానసిక-శారీరిక వికాసములు కలిగి, సమాజమున సంపూర్ణనాగరికులై తమ కర్తవ్యముల గుర్తెరిగి కర్మభూమిలో కర్మప్రవణులై జీవన సంగ్రామమున దృఢసంకల్పులై నిలుచు బ్రహ్మచారిణులు, బ్రహ్మచారులు గార్హస్థ్యమున ప్రవేశించుటకు యోగ్యతాపత్రము గైకొన నర్హులు; సమర్థులును. *పింగళసూత్రములందు

* అధ్యయనా చ్ఛ్రీభవతి, యస్య ధీ స్తస్య శ్రీః, వృద్ధి పూర్వ కత్వా ద్విభూతేః, । యస్య శ్రీ స్తస్యస్త్రీ అర్థమూలకత్వా ద్గార్హస్థస్య.

గల "ధీ, శ్రీ, స్త్రీం" అను వర్ణత్రయమునకు హేలాయు ధుడు విద్యాబుద్ధులతో పాటు ధనము నార్జించినవాడే గార్హ స్థ్యమునకు అర్హుడని వ్యాఖ్యానించెను.

## వి వా హ ము

అయి కళ్యాణి! గార్హస్థ్యము వివాహముతో ప్రారంభ మగును. ఇది షోడశ సంస్కారములలో నొకటి. దీనివలన మనుష్యుడు సుసంస్కృతుడగును. అన్ని ఖండములలో సన్ని జాతులలో వైవాహిక నిర్ణయ మేదో యొకరీతి నెలయుచునే యున్నది. వైవాహిక ప్రణాళికలు దేశకాల విభిన్నములుగ శ్రవణతాడితములగుట మన మెరుగుదుము. అందులో ప్రధాన తమములగు నొకటి రెంటిని విచారింతము.

మొదటిది :— కొందర దృక్పథమున నీ వివాహము బేరము వంటిది. ఐచ్ఛికముగ పెండ్లియాడుదురు. విడాకులు పుచ్చుకొందురు.

రెండవది :— కొందర దృక్పథమున నిది బేరమువం టిదికాదు; కంట్రాక్టునుకాదు. కేవల మీ వివాహము ఒకా నొక జీవకళానుసంధి. ఎడతెగని ధార్మిక దివ్య స్రోతస్విని. దానిలో వధూవరులు కేవలము సంతానప్రాప్తికొఱకే ప్రేమ సూత్రమున పరిస్యూతులగుదురు.

మూడవది :— కొందర దృక్పథమున నిది సమాజ సుఖశాంతినాశకమని భావింపబడును. యువతీ యువకుల స్వేచ్ఛాతరంగ వికసనముల నరికట్టునదని వారి విశ్వాసము.

వివాహము పురాకాలమునుండి వచ్చు రూఢిరూపమగు నొక చెడు ప్రథ యని వారి తలంపు. అట్టి వివాహపు టగ్నిగుండ మునబడి భస్మసాత్కృతు లగుట మానవుల అవివేకము. స్వచ్ఛందప్రవృత్తితో, రేకెత్తిన కామవాసనతో యువతీయువకులు కామోపభోగముల ననుభవింపవలయునని వారియూహ. స్త్రీపురుషులకు అనురాగలత పరిమళించునంతవరకు దాంపత్యసుఖ మనుభవించి, అది ప్రాతగిలిన వెనువెంట విడివడి అన్యత్ర నూత్న దాంపత్యసిద్ధి వడయుట వారి మూలసిద్ధాన్తము. ఈ వైవాహిక, ప్రభేదముల పరిశీలించితివా! వివేకవతీ! వీన ఒకటి మూడు ప్రభేదములు భయంకరములు - కఠోరములు, జుగుప్సావహములు. మరియు నిందు మూడవది కేవలము పాశవము. ఇవి పాశ్చాత్యఖండములందే ప్రచలితములగుచున్నవి; కాని మన పావన భారతావని మూలకోణము నేని దరియనందుల కెంతయు ధన్యులము. భారతదేశమున కీయవి మిక్కిలి హానికరములు. స్త్రీ పురుషులు పశువృత్తి నవలంబించుట-ప్రత్యర్థిత్వమువలన సంఘటించు ఘాతుకనృశంస కార్యములు సమాజ జీవనమున నశాంతి, వైవాహికవిచ్ఛేదము, వ్యాభిచారికప్రవృత్తి, స్వాతంత్ర్యమను పేరిటి యుచ్ఛృంఖలత, ఆత్మహత్య, శిశుహత్య, భ్రూణహత్య మొదలగునవి ఈ పాశ్చాత్య వైవాహిక పద్ధతులవలన వాటిల్లు అనర్థపరంపరలు.

వివాహము నికృష్టమని తలచి దానిని బహిష్కరించువారు కేవలము భ్రాంతిమయచిత్తులు. వైవాహికప్రథానిర్మూలనము వైయక్తిక, సామాజిక నాశములకు దారితీయును. పారివారిక కౌటుంబిక జీవనమునకు భంగము

కలుగును. ఒకని సుఖదుఃఖములందు సంలగ్నమైన స్వార్థ
ప్యమునందేని, రుగ్ణావస్థయందేని సేవాశుశ్రూషల గావిం
చుట తన ధర్మమని ఎవడును భావింపడు. సమాజము మీదు
మిక్కిలి సత్సంతాన విరహితమగును.

పతిదేవతాసతి! మీది ఒకటి మూటి వివాహదశల
వలన సంఘటించు దుష్టపరిణామముల నీ యనుగు బిడ్డలకు
నుగ్గువోయుము. తత్పరిణయ ప్రచార నిరోధకులనుగా నీ
కుమారీ కుమారుల శిక్షింపుము. పవిత్ర భారతీయ ఆర్ష
ప్రోక్తములగు వైవాహిక ప్రణాళికలను విరివిగ ప్రచార
మొనరింప జేయుము.

ద్వితీయ దృష్టికోణానుస్మృతమగు వైవాహికధర్మము
యువతీయువకుల మధ్య నెడతెగని ప్రణయబంధముకలయది.
సామాజికాజ్ఞతో నిర్దిష్టమగు సంకల్పసిద్ధికి ముఖ్యతమ ప్రతి
బంధక నియమావళి ననుగమించి యొండొరులు జన్మాంతము
ప్రణయజీవితమును గడుపుకొందురు. ధర్మసమ్మిళితకర్మలు,
గుణకర్మ విభక్తములగు వర్ణముల కనుగుణ్యమగు కర్తవ్య
కర్మానుష్ఠానములు, సత్సంతానోత్పత్తి, సమస్త భరణ
పోషణములు ఆర్యవధూవరులకు ఉద్దిష్టములగు సముద్దేశ్య
ములు. సంపూర్ణ-విద్యాబలములు, సభ్యతా-సౌశీల్యములు,
సమాన గుణకర్మలు, స్వభావము, ధనము, సకలవిధ సంసిద్ధత
యను నివి వారికి ఆచరణీయ నియమములు.

ఈ దృష్టికోణానుస్మృతిని యువతీ యువకులు వివాహిం
చుట ఆర్యవైదిక ధర్మము. బ్రహ్మచర్య ప్రథమసోపానము
నుండియే సముద్దీపకమగు కామమును జయించి సన్న్యాస

చరమసోపానమున నంగవైచి సమర్థులు మోక్షసిద్ధి పొంద వచ్చును. హృదయమున వైరాగ్యోదయ జ్యోతులు ప్రజ్వలితము లైనప్పుడు బుద్ధభగవానునివలె దయానందస్వామివలె సన్న్యాసమును పొందవచ్చును. శాస్త్రముగూడ "యదహరేవ విరజేత్ తదహరేవ ప్రవ్రజేత్ వనాద్వా గృహాద్వా బ్రహ్మచర్యాదేవ వా" అని నుడువుచున్నది. కామ విజయ ప్రాప్తి ఎల్లరకు సుసాధ్యముకాదు. అదియుగాక సమాజమునకు నుత్తమ సంతానము నర్పించుట, పరోపకార మొనరించుటయు ముఖ్యతమములు. కావుననే ప్రజలు గార్హస్థ్యమును స్వీకరింపవలయును.

ఒకటి మూడు దృక్పథములు పాశ్చాత్యులవి. రెండవది భారతీయులది. పాశ్చాత్య-భారతీయ దృక్పథములలో వింతయగు నొక భావ మిమిడియున్నది. పాశ్చాత్య యువతీయువకులకు వైవాహిక కర్మ జరిగిన మరుక్షణమునుండి ప్రేమవల్లరి వాడిపోవుటయు, భారతీయ యువతీ-యువకులకు వివాహము జరిగిన మరు నిమేషమునుండి వలపుతీవ నవలు దొడుగుటయు గమనింపదగిన యంశములు. భారతీయ వైవాహిక ధర్మము పాశ్చాత్య వైవాహికధర్మము కంటెను, ప్రపంచము నందలి సకల వైవాహిక ధర్మములకంటెను నత్యుత్తమము, ఆదర్శప్రాయము, సారవత్తరమునైనది. ప్రాచ్య వైవాహిక ధర్మములు వేదప్రతిపాదితములు. అగుట అవశ్యాచరణీయములు.

అయి! సుమంగలీ! వివాహము పవిత్రము, దివ్యమునగు ఆత్మికబంధమని వేదములు నుడువుచున్నవి.

ప్రపంచమును సారసత్తర మొనర్చుటకే యువతీ-యువకులు వివాహసూత్రమున తమను బంధించుకొనుచుండిరి. మన వైదిక వ్యాఖ్యాకారులు *'వివాహ' శబ్దమును అసాధారణ శకట (వింతబండి) మని వ్యాఖ్యానించిరి. ఈ జీవనశకటము నకు వధూవరులిరువురును రెండు చక్రములు. ఈ వివాహము గార్హస్థ్యమున తమ సాంసారిక, పారలౌకిక సమధికోన్నతికి యత్నించుటకు సాధనము. విషయవాసనలతో గూడిన కాముకీనానందభూతికే వివాహమగుట యనునెడల దీనినొక బేరమనిగాని, కంట్రాక్టనిగాని వ్యవహరించుట బాగు. విషయ వాసనలు గలిగి సంతానమునే కనుట తదుద్దేశ్యమను పక్ష మున వివాహమను మాటగూడ నెరుగని - ఒక నియతి బంధము-వ్యవస్థయులేని పశుపక్ష్యాదుల కాముక ప్రవృత్తితో నది తుల్యము కావలసివచ్చును. అట్లే ప్రవర్తించునెడల సంతానోత్పత్తి, తచ్ఛిక్షణ, రక్షణ, పరివారమును సిద్ధపరచుట యాదిగాగల ముఖ్య సంకల్పములు వినష్టములగును. నియత స్త్రీ పురుష సమ్మేళనము శాశ్వతమన్ననాడే మీదిధర్మములు ఫలించును. యువతీయువకులు తాము కేవలము వధూ వరులమనియగాక భావిదివ్యసంతతికి కారణభూతులము - విశుద్ధులము నగు మాతాపితల మని భావించుకొనవలయును. ఈ దృశభావ వికసనమునకు వివాహ నిత్యత్వసిద్ధియే మూల హేతువు. భూమ్యాకాశములు ప్రవిభక్తములుకానియట్లు దంపతులును ప్రవిభక్తులుకారు. ఈ భావమునే అథర్వవేదము ఉపమా వైఖరితో "ఓమ్ అమోఽహమస్మి సా త్వగ్ం

* వి = అసాధారణ, వాహ = శకటము.

సా త్వ మస్య మోఽహం సా మాహమస్మి ఋక్త్వం ద్యౌర
హం పృథివీ త్వమ్ తావేవవివహావహై సహ రేతోదధావహై॥
ప్రజాం ప్రజయావహై॥ అథర్వ. కా॥ ౧౪॥ అ॥ ౨॥ మం॥ ౭౧॥
యని ప్రవచించుచున్నది.

"ప్రియ! నేను జ్ఞానిని. జ్ఞానమును మున్నిడి నిన్ను పరిగ్రహించుచున్నాను. నావలె నీవును నన్ను గ్రహించుచున్నావు. నేను సామవేదమను. నీవు ఋగ్వేదమవు. నీవు పృథ్వివలె గర్భాది ధర్మములను వహించు గృహిణివి. నేనో సూర్యునివలె వర్షమును కురియించువాడను; ఈ మన మిరువురము ప్రసన్నతాపూర్వకముగ పరిణయమాడుదము; మన మిరువురము వీర్యమును వహింతము; సత్సంతానమును బడయుదము.

## కులము

అన్వయవతీ! ఉత్తమాన్వయము వివాహమునకు నత్యవసరము. సధర్మములగు నుత్తమ కులములనుండి సముత్పన్నులగు యువతీ యువకులకు వివాహము పొసగును. పావిత్ర్యము, నిరాడంబరత్వము, సదాచారత, ఉత్తమవ్యవహృతిత్వములు అన్వయపు టుత్తమత్వమునకు మెఱుగులువెట్టు శాణోపలములు. ధనవైభవము, ఆడంబరము, ఆచరణశూన్యమగు విద్యాజ్ఞాన సంపన్నతలు వంశోన్నతి ప్రకర్షకములు కానేరవు. ఉత్తమకుల సంజాతులు పరిణత సంస్కారము కలిగియుందురు. వీరి పరస్పర పరిణయ జీవికలు తేజస్వంతములు; సుఖకరములునై వెలయును. పాశ్చాత్య దేశము

లలో ననుక్షణము ప్రణయ పరిణయములు మెండు (లవ్ మ్యారేజి). వీని దుష్పరిణామములు నట నిండు. ఇది ప్రపంచమునకు ప్రస్ఫుటమగు వృత్తము. కాముకవాసనలతో సంఘములై సమానధర్మతను వివక్షింపక ఆత్మలను అస్థాన పతితములు కావించుకొందురు. జీవితములను స్వర్గ్యఫలభోగముల చవికి దూరములు చేసికొందురు. కావున సవర్ణ-సధర్ములగువారు ఓగుబాగుల నరసి పరస్పరము పరిణయమగుట లెస్స.

## స్వ యం వృ తి

స్వయంవరవధూ! వధూవరులు నన్యోన్యము నిర్ణయించుకొనుటలో వధూవరులకే సర్వస్వామ్యము లుండవలయును; తలిదండ్రులుగాని, చుట్టపక్కములు గాని వారి హక్కులను భుక్తపరచుకొనరాదు. స్వయంవృతి వలన వధూవరులకు పరస్పర ప్రేమాభివృద్ధియు ప్రసన్నమనస్కతయు సత్సంతాన ప్రాప్తియు ఆనందమయ జీవికయు సిద్ధించును.

ఋగ్వేద దశమమండలము నందలి ౧౮౩ వ సూక్తమును దిలకింపుము.

"అపశ్యం త్వా మనసా చేకితానం
ఉతపసో జాతం తపసో విభూతం
ఇహప్రజాం ఇహ రయిం రరాణః
ప్రజాయస్వ ప్రజయా పుత్రకామ !"

"ఓ యువకుడా! నీవు జ్ఞానివి, కర్మశీలుడవు నని నాకవగత మయినది. ఈగా గార్హస్థ్యమున బ్రవేశించి బలైశ్వర్యసంపదుదయ కారకుడవై నీకుదులవచ్చుసంతానమును నావలనబడయుము."

"అపశ్యం త్వామనసా దీధ్యానాం
స్వాయాం తనూం ఋత్వ్యే నాధమానాం
ఉపమా ముచ్చా యువతి ర్బ భూయాః
ప్రజాయస్వ ప్రజాయా పుత్రకామే!" ఋ॥ ౧౦-౧౮౩-౨

"ఓ యువతీ! మనసా ధ్యానించు నిన్ను నేనరయు చుంటిని. నీ యెలజవ్వనముతో సంతానార్థినివై ప్రేమాతిశయ మున నాకడ కరుదెమ్ము."

ఇది వధూవరుల స్వయంవృతికి ప్రబల నిదర్శనము. ఇట్టి పరిణయము లత్యుత్తమములు. యువతీ యువకులు పరిణయమాడ నభిలషించినపుడు మున్నుగా నొండొరుల విద్యా-వినయములు, రూప-శీలములు, ఆయు-ర్బలములు, అన్వయ ప్రతిష్ఠల పరిణతులు చక్కగ నెరిగియుండవలెను. ఇట్టి పరిజ్ఞాన మత్యుత్తమమగుట యెరిగియు పరిగణింపక ఝటితి పరిణయమగు కామాతురులకు పరిపూర్ణ సుఖము గాని, సుఖలేశముగాని లభింపనేరదు. జీవన మిత్రుల ఎన్ని కలో మాతాపితలయు, నభిభావుకులయు, నిష్టమిత్రులయు, నాప్తబంధువులయు ఉపదేశ సహాయమును యువతీ యువకు లపేక్షించుట తమప్రేమ జీవనజ్యోతికి ఉజ్జీవనశక్తి నపేక్షిం చుటయ యగును.

## వధూవరుల సంబంధము

"న గృహం గృహమిత్యాహుః। గృహిణీ గృహముచ్యతే
తయాహి సహిత స్సర్వాన్ । పురుషార్థాన్ సమశ్నుతే"

గోభిలీయ గృహ్య సూత్రము ౧-౨-౧౫

"గృహము గృహమని నుడువబడదు. గృహిణియే గృహము. పురుషుడామెతో గూడియే పురుషార్థముల నన్నింటి ననుభవించును."

జీవన స్రవంతిలో కాంతకు కాంతుడును, కాంతునకు కాంతయు ననివార్యసహాయకములగు నుడుపదండములు. ఒండొరులను వారు పూర్ణీకరించుకొందురు. కాంతుడులేక కాంత నీరసము. కాంత వినా కాంతుడు పేలవము.

"ప్రజనార్థం స్త్రియః సృష్టాః । సంతానార్థంచ మానవాః
తస్మాత్సాధారణో ధర్మః । శ్రుతౌ పత్న్యా సహోదితః."

మనుస్మృతి అ. ౯. శ్లో. ౯౬

"గర్భధారణకు స్త్రీలును, సంతానముకొఱకు పురుషులును సృష్టింపబడిరి. కావుననే సపత్నీకుడగు పురుషుని సహధర్ముడని శ్రుతులు నుడివినవి."

"క్షేత్రభూతా స్మృతా నారీ బీజభూతః స్మృతః పుమాన్
క్షేత్ర బీజ సమాయోగాత్ సంభవ స్సర్వదేహినామ్."

మను. అ. ౯. శ్లో. ౩౩

"స్త్రీ క్షేత్రము. పురుషుడు బీజము. వీని సంయోగ సంబంధముననే సకలజీవు లుత్పన్నము లగుచున్నవి."

"పతిర్భార్యాం సంప్రవిశ్య గర్భో భూత్వేహ జాయతే
జాయాయా స్తద్ధి జాయాత్వం యదస్యాం జాయతే పునః."
మను. అ. ౯. శ్లో. ౮

"పతి పత్నియందు ప్రవేశించి, తద్గర్భరూపము దాల్చి పునర్జన్మమునందు కతననే పత్నికి జాయ యను నామాంతర మేర్పడినది."

"ఆత్మా వై జాయతే పుత్రః"
"తానే పుత్రుడై జనించును"

మీది ధర్మశాస్త్రప్రమాణముల నాలోకించిన వధూవరులకు గల సంబంధము విడివడరానిదని విదితమగును. అన్యోన్య సహాయము వినా సంతానోత్పత్తికి నిరువురు నసమర్థులని తేటతెల్లము. తమతమ స్థానముల నిరువురును ముఖ్యులే. నీచోచ్చ భావములు వీరిలో గల్పించుట అవైదికమేగాక అజ్ఞానమూలకము; కేవలము స్వార్థఘృణితమును నగును.

## వరయోగ్యత

వరవర్ణినీ! స్వయంవర వరుని యోగ్యత నెరుగుము. బ్రహ్మచర్య మెల్లరకు నావశ్యకము. పురుషులెల్లరు ఇరువది నాలుగేండ్లు నియతరీతి బ్రహ్మచర్యము పాలించి విద్యాధ్యయనము గావించి, గుర్వనుజ్ఞబడసి గార్హస్థ్యమున బ్రవేశింపవలయును.

"విద్యాం సమాప్య దారాన్ కృత్వా గ్నీ నాధాయ కర్మాణ్యా
రభతే సోమా వరార్ధ్యాని యాని శ్రూయంతే"
ఆపస్తంబ ధర్మసూత్రము.

"ద్వితీయ మాయుషో భాగం
కృతదారో గృహే వసేత్"

మను. ४. అ. శ్లో. ౧.

"ఆయువులోని ద్వితీయభాగమున వివాహం మాడ వలయును."

యువకునికడ పర్యాప్తమగు ధనముండవలయును. అతడు గార్హస్థ్యమును బరిపాలింపవలసినవాడు. ధనమే లేకున్నను వ్యావసాయిక వృత్తితో జీవనమును మధురముగ నడుపుకొనుటకు సమవగు శక్తియేని యుండవలయును. నిరుద్యోగ సమస్యతో నట్టుడికి పోవుచున్న నవీన నాగరకతా ప్రాపంచిక పరిస్థితులు ఆధునికులగు యువతీ యువకులు ముఖ్యముగ గురితించుకొనవలయును. ఈ మన దేశమున దౌర్భాగ్యవశమున దుష్టాచార మొకటి ప్రచలితమగుచున్నది. తలిదండ్రులు ధనార్జనాపరులై ధనమార్జించి తమ బిడ్డలు తమంతవారు కాకపూర్వమే బాల్యమునందే వివాహము చేయుచున్నారు. కళాశాలలలోని విద్యార్థులు అధ్యయనకాలమునందే విషయార్థులై వివాహమాడి, ఎందరో పిల్లలతండ్రు లగుచున్నారు. పెక్కురు పెండ్లిమూలమున చదువునకు స్వస్తియు చెప్పుచున్నారు. తమ తలిదండ్రు లార్జించిన ధనమును కుప్ప తిప్పలుగా వ్యయించి రెంటికిం జెడిన రేవడులై భిక్షుకులుగ మారిపోవుచున్నారు. ఇది తమ బిడ్డలయెడ జూపినట్టి మూఢానర్థకమగు తలిదండ్రుల గొప్ప తప్పు. క్రమమున నల్లుండ్రు సకుటుంబముగ అత్తవారి యిల్లు సొచ్చి బిడ్డలను మాత్రామే గనుచు వారి భరణ పోషణ

ముల కధీనులై యుండుట మిక్కిలి శోచనీయము; అవాంఛ నీయము. ప్రియుడు తన ప్రియను సమానాధికారిణియగు మిత్రునిగా వీక్షింప వలయునేకాని తన క్రిందనున్నట్టి వరాకినిగా-కాలిజోడుగా నరయరాదు. అది మహాపాపము; అతినైచ్యము. స్త్రీ పురుషుల శరీరముల రెంటికిని పరిమితమైన యాకృతి గలిగి, గార్హస్థ్యము వెలయుచుండునని ఉపనిషత్తులు నుడువుచున్నవి.

"స హైతావా నా స యథా స్త్రీపుమాంసౌ
సంపరిష్వక్తౌ స ఇమమే వాత్మానం
ద్వేధా౽ పాతయత్ తతః పతిశ్చ పత్నీ
చాభవతాం తస్మాదిద మర్థవృగల మివ" బృహదారణ్యక ౧-౪-౩

"అర్థశరీరము పత్ని. మిగిలిన భాగము పతి. ఒక బీజమునకు రెండు దళములు. ఒకముత్తైపు చిప్పకు తాలిత మగు రెండు భాగములుగా గార్హస్థ్యమను శరీరమునకు భార్యాభర్తలు సమార్థ ఖండములు."

ఇట్టి సమానత్వమును స్వీకరించి యువతీ యువకులు ప్రవర్తించిననాడే వారి జీవనలత పుష్పించి ఫలించును. వైదిక వాఙ్మయము స్త్రీజాతిని గౌరవించి, పురుషునకువలె సర్వస్వామ్యముల నొసగుచున్నది.

"ఇయమగ్నే నారీ పతిం విదేష్ట
సోమో హి రాజా సుభగాంకృణోతి
సువానా పుత్రాన్ మహిషీ భవాతి
గత్వా పతిం సుభగా విరాజతు"

అథర్వ ౨-౩౬-౩

"ప్రియురాలు ప్రియుని వరింపవలెను. సంతానోత్పాదన సమర్థుడగు ప్రియు డామె మనోభీష్టము సఫల మొనరింపవలయును. ప్రియురాలు రాణియై సుపుత్రులను కని పతిప్రాప్తితో సుభగయై విరాజిల్లుగాత !"

యువతి :— అయి ! కన్యే ! బ్రహ్మచర్యమును లెస్సగా పరిపాలించి పురుషునివలె విద్యాధ్యయన మొనరించిన పిదపనే యువతియు యువకుని వరింపవలెనని అథర్వ వేదము నుడువుచున్నది.

"మృదు ర్నిమన్యుః కేవలీప్రియ వాదిన్యనువ్రతా" అథర్వ ౩–౨౫–౪

"మృదుశాలిని, క్రోధరహిత, ప్రియవాదిని, అనువ్రతయై యువతి వెలయవలయును."

"ఏషా తే రాజన్ కన్యావధూః"

"ఏషా తే కులపా రాజన్"

"అపినహ్యామి తే భగమ్" అథర్వ ౧–౧౪–౧౦౪–౨–౩–౪

"కన్య పురుషునియొక్క సర్వైశ్వర్యము; సమస్త సౌభాగ్యవైభవసర్వస్వమును."

అథర్వ వేదములో స్త్రీలనేతృత్వ మివ్విధమున ప్రతిపాదింపబడి యున్నది.

"ఇంద్రాణ్యేతు ప్రథమాఽజీతాఽముషితా పురః"

అథర్వ ౧–౨౭–౪.

ఏ శక్తిస్వరూపిణి జయింపరానిదో, హరింపరానిదో ఆ శక్తిస్వరూపిణి యగు స్త్రీని "ఇంద్రాణి" యందురు.

"హువే దేవీ మదితిం శూరపుత్రాం" అథర్వ ౩-౮-౨

ఈ మంత్రము "స్త్రీని వీరప్రసవిని" యని నుడువు చున్నది.

"సామ్రాజ్ఞీ శ్వశురే భవ సామ్రాజ్ఞీ శ్వశ్ర్వాం భవ
ననాందారి సామ్రాజ్ఞీభవ సామ్రాజ్ఞీ అధిదేవృషు"
ఋ. ౧౦-౮౫-౪౬

"సామ్రాజ్ఞ్యేధి శ్వశురేషు । సామ్రాజ్ఞ్యుత దేవృషు
ననాందుః సామ్రాజ్ఞ్యేధి । సమ్రాజ్ఞ్యుత శ్వశ్ర్వా"
అథర్వ ౧౪-౧-౪౪

"నవాగత నవోఢను గృహామునకు మహారాణి" యని యీ మంత్రములు నుడువుచున్నవి.

"అన్యమస్మదిచ్ఛ సా త ఇత్యా" యజు. ౧౨-౬౨

"బహుపత్నీయుతుని నిరాకరింప నలయు" నని యీ వాక్యము వధువును హెచ్చరించుచున్నది.

"నమోదేవి నిరృతే తుభ్యమస్తు" యజు ౧౨-౬౨

"దేవి! సత్యపరాయణావగు నీకు నమస్కృతి."

మీాది మంత్రము వలన స్త్రీ సత్యపరాయణయని తెల్లమగు చున్నది. ఇంకను వైదిక వాఙ్మయమున నాచార వ్యవహార ముల యందును, న్యాయ విభాగాదులయందును ప్రసిద్ధ సంస్థాది వ్యవస్థా నిర్మాణములయందును, స్త్రీకి సర్వాధి కారము గలదని ప్రకటితమగుచున్నది. కాని స్త్రీ పురుషులకు ప్రత్యేకీ - కృత మగు కొన్ని స్వామ్య కర్తవ్య కర్మలు గలవు. స్త్రీ కర్తవ్య కర్మలు పురుషు డాచరింపలేడు. పౌరుషేయ కర్తవ్య కర్మలు

స్త్రీయు పొసరింపలేదు. స్త్రీ పురుష కర్మలకుగల ఏతాదృశ వ్యత్యాస ప్రత్యేకత కర్మభావమును పురస్కరించుకొని స్త్రీ పురుషుల యంతరమున నీచోచ్చత పరికల్పించుట పరమ నైచ్యము; వైదిక వాఙ్మయ విరుద్ధము.

"ఇహైవ స్తం మా వియౌష్టం విశ్వమాయు ర్వ్యశ్నుతమ్
క్రీడంతౌ పుత్రైర్నప్తృభి ర్మోదమానౌ స్వస్తకౌ"

అథర్వ౧౪-౭-౨౨

"మీరిరువు రెన్నడును వియుక్తులరు కావలదు. ఈ యుత్తమ గార్హస్థ్యమున పుత్రపౌత్రులతో పరమానంద మనుభవింపుడు"

"స్యోనాద్యోనేరధి బుధ్యమానౌ హసాముదౌ మహసా మోదమానౌ
సుగూ సుపుత్రౌ సుగృహౌ తరాథో జీవావుష సో విభాతీః"

అథర్వ ౧౪. ౨. ౪౩.

"ఉత్తమము-సుఖవంతమునగు నీగార్హస్థ్యమున జ్ఞానోదయమును బొందుచు, ప్రేమతో పరస్పర మానందించుచు సత్ప్రవర్తనగల పుత్ర-పౌత్రులను బడసి, జీవనమును, చరితార్థ మొనరించుకొని ఆదర్శగృహమేధులరై యీప్రపంచమున వెలయుడు."

మీది ఋక్కులనుబట్టి స్త్రీని నైచ్యముగ చూడ రాదని సుదృఢమగుచున్నది. లేకున్న పై ఋక్కుల యర్థ మెట్లు పొసగును ?

స్త్రీని నైచ్యముగ బరికించు పురుషుని మనఃప్రవృత్తియే గార్హస్థ్యధర్మమును విఫల విషమ పరిణామ దుఃస్థితికి దెచ్చు ఘాతుక వైఖరి. ఈప్రవృత్తియే యప్రశాంతము, మాలిన్యము, సంకులమునగు ఝంఝామారుతమును గార్హస్థ్యమున లేవ గొట్టును. ఈదుష్పరిణామమునకు మధ్యకాలీనుఁడు, ధర్మావ తారుఁడునగు శ్రీశంకరాచార్యులవారి ప్రబోధముసైతము దోహద మొసగినది. వారిచ్చిన యుపన్యాసములు, ప్రచు రించిన వ్యాసములు; విరచించిన కృతి సంచయము, చేసిన ఉపదేశములు వైదిక వాఙ్మయ ప్రపంచమున సామ్రాజ్ఞి, సరస్వతి, జ్ఞానవతి, దేవి, సత్యపరాయణ, పురుషునకు సఖియని పవిత్ర సంకల్పములతో చేరొ్కనబడిన స్త్రీకి మానవ సమాజ మున పరిహీణమగు నధోగతిని పరికల్పించినవి. ఇట్టి కఠోర ఘాతుక దుర్మలిన భావతరంగములు సమసిపోయి, పవిత్ర ములు, వైదికాచారానుస్మృతములగు సత్సంకల్పములు సమాజ మున నంకురింప నంతకాలము మాతృదేశము దాస్య శృంఖముల బడనీయని వీరకుమారు లుదయింపజాలరు.

పురుషుడు తానొక స్త్రీని వివాహమాడి ఏకపత్నీ వ్రతుడనై మెలగుదునని శపథ మొనరింప వలయును. ఈ విష యము నొక మహాత్ముడు అఖిల ప్రపంచ సీమల సంచరించి నిదర్శించెను. పాశ్చాత్య దేశములలో స్త్రీపురుషులను లెక్కిం పగా పురుషులు నూర్వురకు స్త్రీలు నూటయిరువురనియు, జపానులో పురుషుల నూటయిరువురకు స్త్రీలు నూర్వురనియు, భారత దేశమునందు మాత్రము నూటనలువురు పురుషులకు స్త్రీలు నూర్వురనియు తేలినది. ఈ ప్రకృతిసిద్ధ గణిత

మర్యాద వైదిక వాఙ్మయమునుండి ప్రకటితమగు ఏకపత్నీ వ్రత ధర్మమునకు దత్తహస్తావలంబన మగుచున్నది. పురుషుడు ఒక స్త్రీని మించి పెక్కురను చేపట్టిన ఈశ్వర ప్రకృతి మర్యాదల నుల్లంఘించి పాపభాజనుడగును.

"ఉభా ధురౌ బహ్నిరాపిబ్దమానోఽన్తర్యోనేవ చరతి ద్విజానిః
బనస్పతిం వన ఆస్థాపయధ్వం నిషూదధిధ్వ మఖనంత ఉత్సమ్."
ఋగ్వేద ౧౦-౧౧

"రథముయొక్క రెండు నొగలమధ్య జోడింపబడిన రథ్యమువలె స్వాతంత్ర్యమును గోల్పోయి అసురుసురనుచు బహుకళత్రుడు జీవన మార్గమున ప్రయాణించు" నని మీది ఋక్కు బహుకళత్రుడగువాని బాధాస్థితిని ప్రకటించుచున్నది.

## పరిణయ ముఖ్యోద్దేశ్యము

సత్సంతతిని బడసి, వారిని సుసభ్యుల నొనర్చి, సమాజమునకు సర్పించి దంపతులు ధన్యతిములు కావలయును. ఇందులకు భారతమునందలి రుక్మిణీ శ్రీకృష్ణుల వివాహ చరిత్ర నారయుట లెస్స.

కృష్ణుడు స్త్రీలోలుడని నుడువుట కల్లయనుట కీచరిత్ర నిదర్శనము. తమకు పరిణయము జరిగిన వెనువెంటనే ఆధునిక యువతీ యువకులవలె లోలుపత్వమవలంబింపక పదురెండు వత్సరములు బ్రహ్మచర్య మాచరించి మహా తేజస్వి, విమలయశస్వియునగు ప్రద్యుమ్నుని బడసిరి. ఉత్తమసంతానమును బడయదలచిన యువతీయువకులెల్లరు ఈ యాఖ్యా

యికను గురుతించుకొనవలయును. ప్రతిగృహమేధియు గృహమునకు సంబంధించిన ధనధాన్యాది సమస్తభాండాగార సంపదలు తన గృహిణియను సామ్రాజ్ఞికి నొసగి యా సంపదలకు పర్యాయము పొసగనీయట్లు తాను నిరీక్షకుడై మెలగవలయును. ఇట్టి మీది నియమములను పాటించువాడే గార్హస్థ్యమున ప్రవేశించుటకు అర్హుడగును.

## వ ధూ యో గ్య త

వధూ! కన్యకూడ కనీసము పదునారు వత్సరములు పవిత్ర బ్రహ్మచర్యమును పాటింపవలయును. దాని నియమావళి ననుసరించు అధ్యయన మొనరింపవలయును. పిదపనే వివాహయోగ్యురాలగును. ఈ క్రింది వేద వాక్యమ పరికింపుడు.

"బ్రహ్మచర్యేణ కన్యా యువానం విందతే పతిమ్"

అథర్వ ౧౧–౫–౧౮

"వధూరియం పతి మిచ్ఛతీతి" "కన్య పతిని వాంఛించుచున్నది." అను మీది నుడినిబట్టి వ్యక్త వయస్కయగు కన్యకకే పరిణయము చెల్లును. బాల్య వివాహమున కన్య తాను భర్తను వాంఛింపలేదు; కనుక అది చెల్లరాదని వైదికధర్మము. మరియు ఇరువదియైదు వత్సరములుగల యువకునకు పదునారేండ్ల జవ్వని నొసగుట తగునను వైదిక ధర్మమును సుశ్రుతాచార్యులును బలపరచిరి.

"అథాస్మై పంచవింశతి వర్షాయ షోడశవర్షాం పత్నీ మావహేత్"

సుశ్రుత – శారీరక–అ ౧౦.

చాలమంది రజస్వల కాక పూర్వమే బాలికకు వివాహము చేయుచున్నారు. ఇది బహుపాపము. ఈ క్రింది రామాయణ శ్లోకార్థము బరికింపుడు.

"పతిసంయోగ సులభం వయో దృష్ట్వా తు మే పితా"

"పతిసంయోగమున కర్హమైన వయస్సును తిలకించి నాతండ్రి నాకు స్వయంవృతి చాటబంచెను."

రజస్వల యయినగాని పతిసంయోగ సులభమగు వయస్సు లభింపనేరదు. రాముని అవతార పురుషునిగా భావించువారు మీదివిషయమును దిలకించియైనను సునిశిత బుద్ధితో బాల్యవివాహములనుండి తమ దృష్టిని మరలించు కొనవలయును.

"ఋతుస్నాతా తు యా శుద్ధా సా కన్యేత్యభిధీయతే"

"ఋతుస్నాతయే కన్య యనిపించుకొనబడును."

"షోడశవార్షికం యావత్ బాల్యం తావత్ ప్రవర్తతే"

హారీతసంహిత, శారీరకసంస్థానము అ. ౧౦.

"పదునారేండ్లవరకు బాల్యము" కావుననే రజస్వలానంతరమే కన్య వివాహయోగ్య యగును. ఋతుమతియైన మూడు వత్సరములకు పిమ్మటనే కన్యకకు స్వయంవరము కల్పింపవలయును.

"త్రీణి వర్షాణ్యుదీక్షేత కుమారీ ఋతుమతీ సతీ
ఊర్ధ్వంతు కాలాదేతస్మాత్ విందేత సదృశంపతిమ్"

మను. అ. ౯ శ్లో. ౧౦

" కుమార్య్యృతుమతీ త్రివర్షాణ్యుపాసీతోర్ధ్వం
" త్రిభ్యః వర్షేభ్యః పతిం విందేత తుల్యమ్" వసిష్ఠ. అ. ౭.

" త్రీణివర్షాణ్యుదీక్షేత కన్యా ఋతుమతీ సతీ
చతుర్థేత్వథ సంప్రాప్తే స్వయంభర్తార మార్జయేత్ "

" ప్రజా న హీయతే తస్యా రతిశ్చ భరతర్షభ
అతో న్యథా వర్తమానా భవేద్వాచ్యా ప్రజాపతేః. "

మహాభార-అనుశాసనిక. అ. ౪౪

" ఋతుమతియైన పిదప కన్య మూడు వత్సరముల పాటు పతికై ప్రతీక్షింపవలయును. అటుపిమ్మట తనకు సదృశుడగు పతిని వరింపవలయును."

"గృహకృత్యములలో కౌశలమునుబడసి, అల్లిక - కుట్టు మొదలగు లలితకళల నేర్పరియై మాతృగేహమున సోదర సోదరీమణులతో సంతానపాలన పోషణములందు సిద్ధహస్తయయిననాడే కన్యయు గార్హస్థ్యమునకు నర్హురాలగును.

పతివ్రతాధర్మమున దృఢసంకల్ప కావలయును. పర పురుషునకు స్వభర్తృస్థాన మెన్నడేని నొసగరాదు.

ఈదిగువ సంప్రశ్నములను కన్య తనకుదాను ప్రశ్నించుకొని ఉచిత సమాధానములను తనహృదయ మిచ్చినపుడే ఆమె గార్హస్థ్యమున కర్హురాలగును.

## ప్ర శ్నా వ ళి

1. నాలో యథార్థప్రేమ యుదయించినదా ?

2. శారీరక - సామాజిక - నైతిక దృక్పథములతో నేను వివాహామునకు యోగ్యురాలనైతినా ?

3. వైవాహిక భావిజీవనమును భయాకుల మొనరించు వంశ పారంపరిక వ్యాధిబీజములు మాకులమున నేమైన గలవా ?

4. పతిని బ్రసన్నకలితు నొనరించుకొని, గార్హస్థ్యమును నిరపాయముగా నడుపుకొను క్షమాశక్తి నాలో వెలసియున్నదా ?

5. నా జీవన పథమున తోడునీడయగు భావిపతి సచ్చరిత్రుడై నా ప్రేమాధికారి కాగలడా ?

6. అతడు వర్ణ – గుణ – శిక్షా – కర్మాదులలో నాకు దీటగునా ?

7. మా యెల ప్రాయముల తారతమ్యము నా కెరుకపడి సమ్మతి కూర్చినదా ?

8. శిశుపోషణమునకు తగిన శిక్ష నాకు నేను మప్పికొంటినా ?

9. గార్హస్థ్య నియమావళి నభ్యసించి తెలిసికొంటినా ?

ఇట్టి ప్రశ్నములనే యువకులును తమ్ముదాము ప్రశ్నించుకొనవలయును.

## ఈడు జోడు కాని పెండ్లి

"కామ మామరణా త్తిష్ఠేత్ గృహే కన్యర్తుమత్యపి
నచైవైనాం ప్రయచ్ఛేత్తు గుణహీనాయ కర్హిచిత్"

మను అ. ౯ శ్లో. ౮౯

కన్యను మాతృగృహమున ఆజన్మము బ్రహ్మచారిణిగా నైన నుంచవచ్చును; కాని, గుణవిహీనునకు నీయరాదు.

''కన్యాం యచ్ఛతి వృద్ధాయ నీచాయ ధనలిప్సయా
కురూపాయ కుశీలాయ స ప్రేతో జాయతే నరః''

''ధనలిప్సచే కురూపికి, వృద్ధునకు, కుశీలునకు, నీచునకు కన్య నొసగు నరుడు ప్రేతమగును.''

ఈడు జోడు లేని వివాహములు ముత్తెఱగులుగా సాగుచున్నవి. వయోవైషమ్యము, యోగ్యతా భేదము, బాల్య వివాహము. మీది మూడు వివాహములును సామాజిక సమష్టి జీవన స్రోతస్విని కలతపెట్టి దూష్య మొనరించు విషయమున తులాతూలితములే. భావికాల గర్భితమగు గార్హస్థ్యమను నందనోద్యానమున సమగ్ర వికసితములై దిగ్వలయమును సువాసిత మొనరింపనున్న మన యువతీ యువకులనెడు దర వికసిత కోరకములను బాల్యవివాహ కర్త లగు కొందరు కఠిన రాక్షసులు నులిమివేయుచున్నారు. స్వయంవర రూప విశ్వజనీన వివాహముల మూలమున సమాజమునకు శాంతిభద్రతలను గల్పించుటకు ప్రత్యామ్నాయముగా మీది ముత్తెఱగుల పెండ్లిండ్లు నిరాఘాటముగ సాగించి సమాజమున నశాంతి, వ్యభిచార దుఃఖమయ జ్వాలలు పురికొల్పి శాంతి భద్రతలను భస్మీకరించుచున్నారు. కుమారీ కుమారుల బలాత్కృత వైధవ్య రక్తాశ్రువులచే. కళంక కాలిమముచే పాపపర్వతమును పెంచుచున్నారు. వితంతు వివాహసమస్య వారి బుద్ధి నొరసినపుడు బాల్య వివాహ సంభూత పాపములను దీని మూలమున పరిహరించుకొనుటకు బదులు మర్యాద నశించుననియు, ధర్మ మడుగంటును ననియు మిథ్యారూపములగు ఆత్మపతన భావములను మాఱు

పరచుకొని వాని నభివృద్ధి పరచుకొనుచున్నారు. మీాది అసద్వివాహముల వలన పతులను గోల్పోయిన వితంతువు లెందరో అన్యమతస్థుల శరణు బొందుచున్నారు. ఈడుజోడు కాని బలవద్వివాహము మన హైందవ సమాజమునకు తీరని నష్టకష్టములను గలిగించుచున్నది.

## వితంతు వివాహము

ఈ వితంతు వివాహమును మనుస్మృత్యాది సచ్ఛాస్త్రములేగాక పురాణములుసైత మనుమతించుచున్నవి. వ్యష్టి - సమష్టి శ్రేయస్సుకొరకేని కనీసము, ఆపద్ధర్మము కొరకేని దీనిని ప్రోత్సహింపవలయును. కొందరయ్యలు దీనిని ధర్మవిరుద్ధమని నిరాకరింతురు. కాని రాజాధికారము తలపై తాండవించినపుడు కిమ్మనక ఎంతటి శాస్త్ర విరుద్ధకర్మనైన నాచరింతురు. వితంతు వివాహ విషయమున త్రయీాధర్మము శాస్త్ర శాసనము ఎంతవరకు సరిపడునో ఇంచుక విచారింతము. ధర్మమన నెట్టిదియో మున్ముందు మనుధర్మ శాస్త్రమునగల ఈక్రింది శ్లోకమును తిలకింపుడు.

"శ్రుతి స్మృతి సదాచారః స్వస్యచ ప్రియ మాత్మనః
ఏతచ్చతుర్విధం ప్రాహుః సాక్షాద్ధర్మస్య లక్షణమ్"

"వేదము, శాస్త్రము, సదాచారము, ఆత్మ ప్రబోధమను నీ నాలుగు ధర్మజ్ఞానమును నిరూపించు నొరపిడిరాళ్ళు." వితంతు వివాహమున ధర్మజ్ఞాన నిరూపకములగు నీ నాలుగు శాణోపలము లుపయోగించిచూతము.

"యా పూర్వం పతిం విత్వా । థాన్యం విందతే పరమ్"

ఋక్ ౧౦-౮౫-౪౫

"పూర్వపతిని గోల్పోయిన పడతి వేరొకపతిని నియోగరీతితో తిరిగి బడయుచున్నది"

ఈ విషయమునే అథర్వములోని ౧౮-3-3, ౧౮-౮-33 మంత్రములును, ఋగ్వేదములోని ౧౦-౪౦-౨, ౧౦-౧౮-౮ మంత్రములును బలీకరించుచున్నవి.

"నష్టే మృతే ప్రవ్రజితే క్లీబేచ పతితే పతౌ
పంచస్వాపత్సు నారీణాం పతి రన్యో విధీయతే"

పారాశర స్మృతి అ ౪ శ్లో ౩౦.

"పతి కేవలము చనిపోయినపుడు మాత్రమే కాక అతడు దేశాంతరమున నిలిచిపోయినపుడుగాని, సన్యాసము పుచ్చుకొన్నప్పుడుగాని, నపుంసకు డైనప్పుడుగాని, పతితుడైనప్పుడుగాని పడతి మరొకపతిని స్వీకరించుటను" పారాశరస్మృతి యంగీకరించుచున్నది. ఇట్లే నారద - వాసిష్ఠ - యాజ్ఞవల్క్య - మనుస్మృతులును అంగీకరించుచున్నవి.

"పత్యభావే యథైవ స్త్రీ దేవరం కురుతేపతిమ్"

మహాభారత - శాంతి ప. అ. ౭౨.

"కాంత తన పతి మరణించిన వెనుక దేవరుని పతిగా స్వీకరించుచున్నది."

సదాచార విషయములో పూర్వేతిహాస వాఙ్మయమును ప్రమాణీకరించుకొనవలయును. పతి జీవించియున్నను స్త్రీ పునర్వివాహముమీాది పారాశరస్మృతి కొన్ని పరిస్థితు

అంగీకరించుచున్నది. పతి మరణానంతరము స్త్రీ కేవలము సంతానభాగ్యము బడయుటకు అధికారమున్నట్లు పూర్వేతిహాసముల ప్రబలమగు తార్కాణము గలదు. విచిత్రవీర్యుడు మరణించినపుడు అంబికా అంబాలికలు వ్యాసుని వలన ధృతరాష్ట్ర - పాండురాజులను బడసినట్లు భారతమున స్పష్టముగ గలదు.

తన కూతురు దివ్యాదేవికి ఒకని తరువాత నొకరు మరణించుచుండగా ఇరువదిఒక్క పతులను క్రమముగనిచ్చి దివోదాసను రాజు పరిణయ మొనర్చినట్లు మరొక ఉద్గ్రంథము చాటుచున్నది. ఆకాలమున గల ఉద్దండ పండితు లెల్లరు స్త్రీపునర్వివాహమును నిరాఘాటముగ సమ్మతించిరి.

బాల్య వివాహములు, ఈడు జోడు కాని వివాహములు చేయుటవలన సాంఘిక దురాచారములు ప్రబలిపోవుచున్నవి. వితంతువుల సంఖ్య హద్దుమీరుచున్నది. వీరికి పునర్వివాహము అజ్ఞానముకతన శాస్త్ర విరుద్ధమని చేయకుండుట వలన వచ్చు నష్టకష్టములు ప్రజలు సూక్ష్మదృష్ట్యా గమనించకపోవుటయేగాక స్థూలదృష్టితోనైనను పర్యాలోచించుటలేదు. వ్యాభిచారిక ప్రవృత్తులు, అన్యవర్ణపురుషానుగమనములు, శిశు - భ్రూణ హత్యలు మొదలగునవి జరుగుచుండుట సతము మనము కనులార గాంచుచునేయున్నాము. ఇట్టివి నశించినగాని మన దేశమునకు - జాతికిని కల్యాణము చేకూరదు. తాదృశ కల్యాణము స్త్రీ పునర్వివాహమున నిహితమై యున్నది. కావున అనురూపవయస్కుల పరస్పర వివాహములు చేసినట్లయిన బాల్యవివాహ

ముల వలన గలుగు పాపఫలముల పరిహారము లనదగు స్త్రీ పునర్వివాహముల అవసరమే కలుగదుగదా !

**కన్యాశుల్క, వరవిక్రయములు :—** సౌశీలినీ ! మన భారత వర్షమున ప్రచారములైయున్న వైవాహిక దురాచారములలో వరవిక్రయము, కన్యాశుల్కములు సమాజ రసాలపు కూకటివేరుల పెకలించు ఘాతుక కీటకముల పోలియున్నవి. కన్యాపక్షమువారు కొంత మొత్తమిచ్చి వరుని కొనుట వరవిక్రయమనియు, వరపక్షమువారు కొంతసొమ్మునిచ్చి కన్యను గొనుట కన్యాశుల్కమనియు వ్యవహృతములగును. ఇవి రెండును అవైదికాచారములకు జేరినవి. వీనివలన నెందరో మన సోదర సోదరీమణులు మాతృగృహములలో కౌమార్యమును వెళ్ళబుచ్చుచు తలిదండ్రులకు భారభూతులై ఆజన్మము నిరాశాశ్రువులతో నుండుచున్నారు. కేవల ధనాశాపరులయి, తమకూతులను అసమర్థులు, వృద్ధులు, రోగగ్రస్తులు, కుమార్గగాములు, వికలాంగులు, కురూపులు నగు పతులకు విక్రయించుటచే వారి సాంసారిక జీవనములు సంతతము అశాంతిమయములు, కల్లోల సంకులములు నగుట భర్తల నుజ్జగించి కులటలై పోవుట, సోదరీ ! నీ వెరుగుదువు. పెక్కురు ఆత్మహననము నకు పూనుకొనుటయు నీకెరుకయే. వరవిక్రయములు భరింపలేనివారును, కన్యాశుల్కములు నీలేనివారుని నైరాశ్య క్రోధములతో సమాజమునకు ప్రతిఫల మొసంగ అన్యమత ప్రవిష్టులై కారములు మిరియములు నూరుటయు నీకు విదిత పూర్వమే. ఇట్టి దుష్ప్రథ యణగిననాడే మన దేశమునకు సౌభాగ్యము లభించును. ఈ విషయమును గురించి గాంధీ మహాత్ముడు "హరిజన" పత్రికలో నిట్లు ప్రకటించియుండెను.

"కొన్ని మాసములకు పూర్వము "స్టేట్స్‌మెన్" అను పత్రిక కట్నములగురించి సమస్యనొకటి లేవదీసెను. ఈ వర విక్రయ కన్యాశుల్క దురాచారములు సమస్త భారత వర్షము నందలి అనేక జాతులలో ప్రచార బాహుళ్యము నంది యున్నవి. పయి పత్రికాసంపాదకుడు ఈ విషయమున తన యభిప్రాయమును వెలువరించెను. "యంగ్ ఇండియా"లో నేనును అనార్యమగు దీనివిషయమై తరచు వ్రాయుచుండెడి వాడను. ఆ రోజులలో కట్నములు - కానుకల విషయమై నే వినియుండిన నిర్దయాతి నిర్దయములు, అతి గర్హ్యములునగు వార్తలను ఈ పత్రికాసంపాదకీయ వ్యాసములు నూత్న పరచినవి. సింధు దేశమున ప్రచార బాహుళ్యము పొంది యున్న ఈ దురాచారముల లక్ష్యమునందుంచుకొని ఎన్నియో వ్యాసములను "యంగ్ ఇండియా"లో ప్రకటించియుంటిని. యుక్తవయసువచ్చి ధనాభావమున వివాహములు కాక యింట మసలుచున్న కన్నకూతులగాంచి కన్నీరు గార్చుకొనుచు, ప్రపంచమున బయలు దేరిన అపవాదములకు, అపనిందలకు మానావమానములకు గురియయి పొగులుచున్న తల్లిదండ్రుల రక్తమాంసములను పీల్చి పిప్పిచేసి, ధనరాసులను దోచుకొను నాగరకులు సుశిక్షితులమని విఱ్ఱవీగువారు సింధు దేశమున నెందరో గలరు. కాని ఈ పద్ధతికి విరుద్ధముగా "స్టేట్స్‌మెన్" పత్రిక తీవ్రాందోళన మొనరించెను. వరశుల్కము చాల నీచాతినీచ మగుటయేగాక అనర్థదాయక మనుటలో అతిశయోక్తి ఎంతమాత్రమును లేదు. నాకు తెలిసినంతలో జనసామాన్యము దోషభూయిష్ఠమగు నీదురాచారమునకు

బలికాలేదని భావింతును. విశాల భారత జనసముద్రమున బిందువదాచరించు మధ్య శ్రేణికిం జెందిన పరిమిత జనము మాత్రమే యీదుష్టపిశాచ కరాళ దంష్ట్రలకు గురియయినట్లు దెలియుచున్నది. కరీతులగురించి విచారించునపుడు హెచ్చుగా మధ్యతరగతివారే మన దృష్టికిం దగులుదురు. గ్రామీణులగువారి కష్ట – నష్టముల గురించి, ఆచార – వ్యవహారములను గురించి, మనము స్వల్పాతి స్వల్పముగనే తెలిసికొని యుందుము. ఈ కట్నముల పెనుభూతము జనసామాన్యము నావేశింపకున్నను మధ్యతరగతివారి నావేశించి, దైనందిన సాంఘిక జీవన సారళ్యమునకు భంజక మగుచున్నందున దీనిని సమూలముగ నున్మూలము గావింపకుండుట శోచనీయము మాత్రమే గాక ఉచితమును గాదు. దీని నెట్లైనను కూకటివేరుతో పెరికివేయుట లెస్స. ఈ కట్నముల పద్ధతికిని వర్ణవ్యవస్థకును మిక్కిలి దగ్గర పొత్తు కలదు. దీనికి ఎన్నెన్ని వ్యతిరేకాందోళనములు సాగించినను, ఈ సంకుచిత వర్ణవ్యవస్థను తొలగించి విశాల మానవసమాజము నేర్పరచి అందు యువతీ యువకులకు స్వేచ్ఛాస్వాతంత్ర్యము లొసగి, వైదిక స్వయంవర విధానమును కార్యరూపమున నమలు జరుపని యంతవరకు నీ దుష్టపద్ధతి భారతదేశమును వీడి చనుట అసంభవము. యువతీ యువకుల తలిదండ్రులు ఈవర విక్రయ రూపఢాకినీ వివృత భయదముఖ దంష్ట్రల నుండి బయలువడవలయున్న నీసంకుచిత వర్ణవ్యవస్థావలయమును నవశ్యము భేదింపక తప్పదు. వీనితోపాటు ఆజన్మనిబిడబంధమగు వైవాహిక తంతు రహస్యమును లేశమాత్రముగానేని

నెఱుగజాలని, ప్రాపంచిక కష్ట సుఖ పరిణామములు ననుభవ మునకు నించుకేనియు తగులని పసికూనల బాల్యవివాహ ములు కూడ నిశ్శేషముగ నసమసిపోవలయును. రజస్వలలగు కన్యలకు ధనాభావాది కారణములవలన అనురూపవరులు దొరకని యపుడు, కఠిన బ్రహ్మచర్యవ్రతము నైన నవలం బించి, వరులు దొరకునంతవరకు వేచియుండగల క్షమాధైర్య ములు వారి కుండి తీరవలయును. అంతర్రాష్ట్రీయ యువతీ యువకుల మనఃక్షేత్రములందు విప్లవ బీజముల రేకెత్తింప వలయును. ఇవి యన్నియు సమగ్రముగ సిద్ధించిననాడు కట్నముల పెనుభూతము స్వరూపనాశము జెందును. నేటి మన శిక్షావిధానమే వక్రమార్గము ననుగమించి, సమాజ దేశ సుఖశాంతుల కిసుమంత యైనను తోడ్పడుట లేదు.''

ఎటులయినను నీ కురీతిని సాధ్యమగునంత శీఘ్రముగ రూపుమాపి దేశ సమాజ సౌభాగ్యములకు తోడ్పడుట మంచిది.

## అపవ్యయము

వివాహ సమయమున వెనుకముందు లాలోచింపక అపవ్యయ మొనరించుట మనలో నతి గాఢముగ నాటు కొని యున్న దురాచారములలో నొకటి. తాను పరులకు ఋణపడియున్నను, ఇల్లు-వాకిలి, పొలము-బ్రాట్లు మొదలగు జీవనాధారములగువాని నమ్ముకొనవలసి వచ్చినను భావి పరిస్థితుల నొకమారు సింహావలోకనము గావింపక వెనుదివియని చిత్తముతో విక్రయించుకొని వృథా వ్యయ

మొనరించి భంగపడువారు మనలో కోటానుకోట్లు గలరు. శుభకార్యములయం దట్లు ఖర్చు పెట్టకుండుట సమాజమున తమకు అగౌరవము, అప్రతిష్ఠయని పాపము! వారి తలంపు. కొఱమాలిన నిట్టి తలంపులే భారతీయార్యసంఘము నీవిధముగ ఆర్థిక పరిస్థితుల నంతరాయములు కల్పించి, అట్టుడికింప జేసినవి. కన్యా - వరపక్షీయు లిరువురను ఈ అపవ్యయ పిశాచము ఆవేశించియే యున్నది. అందును కన్యాపక్షము వారికి ఆ యావేశము ఎక్కుడు. వివాహపు ముఖ్య సంకల్పమునకు సన్నిహితములుగాని అనవసర ఆడంబరముల నడ్డుకట్టి, కేవల మాయొక్క వివాహ సంస్కారమునే అమలున పెట్టి, అందు పరిమితమగు స్త్రీ పురుషులు పాల్గొని, దాని నిర్విఘ్నముగ పూరించుట సముచితము, వివేకము నగును. ఇందువలన రోజులకొలది పెండ్లివారు చుట్టపక్కములను మధురాన్న పానములతో పరితృప్తి పెట్టవలసివచ్చు శ్రమయు, అపవ్యయమును తప్పుటయే గాక వారి ఆరోగ్యములు పరిక్షీణములు కాకయుండును.

తరలి పెండ్లి, అంపకములు, త్రిరాత్ర నిద్రలు, కంకణములు విప్పుట మొదలగు పౌరాణిక వికృతపు పేరులతో మన వైవాహిక క్రియా కాండమును ధన కాలముల దుర్వ్యయముతో ననవసరముగ పెంచుచుందురు. అదియెంతయు ననార్య పద్ధతి, అసహనీయమును. మూడవ జామున వరునకు సంబంధించిన స్త్రీ పురుషులు కొలదిగ వధూ గృహమున కేగుటయు, ౫ గంటలు మొదలు ౯ గంటలులోపున వివాహక్రియాకాండమును సంపూర్ణము

గావించుకొని ఆరాత్రి నటనే ఆతిథ్యము స్వీకరించి ఉషః కాలముననే అటనుండి తరలి తమ యిండ్లకు జేరుట వివాహ సంకల్పమునకు సముచితమును, సార్థకమునైన పద్ధతి. అంత కన్నను ఇరుపక్షములవారు ఏదేని యొక ఆర్యపూజా మందిరమునకు వెళ్ళి, అచ్చట తమ వైవాహిక క్రియాకలాపమును పూర్తిగావించుకొని అనంతరము ఎవరి గృహమునకు వారు వెళ్ళుట సర్వాంగతః సరసమగుపద్ధతి; ఆదర్శకమును. వివాహమన్నివిధముల ఆడంబర రహితముగ నుండవలయును. అట్లని అవసరముల పరిత్యజింప వలనుకాదు. ప్రశాంతముగ నుండవలయును. అట్లని సౌందర్యమును తిరస్కరింపరాదు. ఉచితములు, సాత్త్విక ఆకర్షణీయములు నగు అన్ని సంవిధానము లుండవలయును; కాని ఉద్రిక్తములు - పటాటోపములు నగునవి ఉండరాదని దీని తలంపు. "పెండ్లి కొంచెముసేపు తలవంచుకొని తిరిగిన - జీవితమంతా తలయెత్తుక తిరుగ వచ్చునను" సామెతలోగల గూఢార్థమర్మ... నరయుదురు గాక! నేటి వివాహముల పర్యాయపరచు ఆ సొమ్మును నిలువజేసి ఆదంపతుల సంతానము విద్యా - బుద్ధులకుగాని, శ్రేయో-భివృద్ధులకుగాని ఖర్చుపెట్టుట వివేకము, విహితము నగు పని. నేటి యీ వివాహములు ధనరాసుల కరగించి, సంఘమును దారిద్ర్యమయము గావించుచున్నవి. నాటి వైదికవివాహములకును - నేటి పౌరాణిక వివాహములకును హస్తిమశకాంతరము కలదు. వైదిక వివాహములు ఉద్దేశ పరిపోషకములు. పౌరాణికములు ఆడంబర దూషితములు.

అవి సాత్విక దివ్యతేజస్సునకు పరిస్ఫోరకములు. ఇవి తామసికోన్మత్తక్రియాపరిభూతనులు.

ఈ వైదిక వివాహ పథము నాదర్శకముగా గొన్న మన సంఘము దీప్తివికాసముల గాంచుననుట అతిశయోక్తి కానేరదు.

## వివాహ సమయము

ఉత్తరాయణమునందలి శుక్లపక్షము వివాహమునకు నతియోగ్యమగు సమయము. ఆశ్వలాయన, పారస్కర, గోభిలీయ, శౌనకాది గృహ్య సూత్రములు ఈ కాలమునే సమర్థించుచున్నవి; కాని అవసరముల బట్టి వివాహ మెల్ల వేళల చేయవచ్చును. "సార్వకాల మేకే వివాహ" మ్మను ఆశ్వలాయన గృహ్యసూత్రము అభ్యనుజ్ఞ యిచ్చుచున్నది. వివాహమున పూర్వవిధి - ఉత్తరవిధి యని రెండు యోగములు కలవు. పూర్వవిధియందు సూర్యావలోకనము, ఉత్తర విధియందు ధ్రువారుంధతీ తారావలోకనమును విహితములు. పూర్వవిధి సాయంసంధ్యావసానమునకు ముగించి, పిమ్మట సంధ్యాదివిధుల నిర్వర్తించుకొని, కొంతకాలము విశ్రమించి, ఉత్తరవిధిని రాత్రి 9 గంటలలోపున పూర్తి గావింప వలయును. నేడు అమలులోనున్న అర్ధరాత్ర లగ్నములు, రాత్రావసాన లగ్నములు మొదలగునవి పురాణములబట్టి కలిగినవి; కాని అందలి నక్షత్రములకుగాని, మేషమిథునాది రాసులకుగాని యెట్టి ప్రయోజనము, అర్థమును లేదని గ్రహింపవలయును. ఇట్టి అర్థములేని లగ్నములతో తలిదండ్రులు

కష్టపడుటయేగాక తమసంతానమునుకూడ తీరని నష్టములకు లోనొనరించి పవిత్ర గార్హస్థ్యమును నరకమయము మొనరించు చున్నారు. చెల్లీ! ఇట్టి అవైదికాచారముల పొంతకు పోక మన పురా ఆర్యమహర్షుల అడుగుజాడల నడచుచు, కనీ సము మీ స్త్రీ సమాజమునేని ఉద్ధరించుకొన ప్రయత్నిం చుము.

## వివాహ ప్రతిజ్ఞలు

ఉత్తమ గార్హస్థ్యము భార్యాభర్తల పారస్పరిక ప్రస న్నతపై ఆధారపడి యుండును. కావుననే వారిరువురును వివాహమునకు పూర్వమందును, పరమందును అన్యోన్య హృదయావర్జనమునకు, సంకల్ప వికల్ప పరిష్కార నివేదనమునకు యత్నించి, తమ అవ్యాజ కోమల ప్రణయ వల్లరి ప్రాకునకు నెత్తుల కూర్చుకొనవలయును. అప్పుడే వారి గార్హస్థ్య వల్లరి ఆనంద ప్రపూర్ణమై, సుఖాల వాలమై దివ్యప్రసవముల నుత్పాదించును. తాదృశచారి తార్థ్యపరిపుష్టికి దంపతు లిరువురు కొన్ని ప్రతిజ్ఞల చేయ వలసి యుండును. అందు :—

మొదటి ప్రతిజ్ఞ :—

"ఓమ్ సమంజంతు విశ్వే దేవాః సమాపో హృదయాని నౌ
సం మాతరిశ్వా సంధాతా సముదేష్ట్రీ దధాతు నౌ."

"సభాస్థానాలంకారులగు నో విద్వాంసులారా! మా యిరువురి హృదయములు జలములవలె నైక్యము జెందినవి. మేము ప్రాణవాయువులవలె సామ్యమును వహింతుము. జగ

షమును ధరించియున్న పరమాత్మునివలె మేమిరువురము ఒకరినొకరము ధరించుకొని ఆధారాధేయ భావమున మెలగుదుము. ఉపదేశకుడు శ్రోతల ప్రేమించుమాడ్కి మేమిరువురము దృఢ ప్రేమానుబంధమును వహింతుముగాక! ఈ మా నిశ్చయమును తాము గురుతింతురుగాక!''

వధూవరులు తమ హృదయములను పరస్పర గాఢ ప్రేమానుబంధ వ్యవహారమున నిబంధించుకొని సుస్థిరత గూర్చుకొనవలయునని ఈ వైదిక మంత్రమువలన తేటతెల్లమగుచున్నది. ఈ విషయమును పాశ్చాత్యులు సైతము సమ్మతించిరి. డాక్టరు మైగ్నన్, హిర్సఫీల్డు వెల్లడించిన వైఖరి గాంచుడు!

సుఖమయానంద ప్రపూర్ణములగు వివాహములు పరిష్కారమగునది స్వర్గసీమలయందు కాదు; మరి పాకగృహములందే వాని పరిణతులు ప్రస్ఫుటములు కావలయును. యువతీ యువకులు వివాహమునకు యోగ్యులయిరను విషయమును మాత్రమేగాక వారు పరస్పరము ఆనందపెట్టుకొనగల పరిపక్వస్థితిని ప్రాప్తించిరా – లేదా యను విషయమును గూడ లెస్సగ గురుతింపవలయును.

రెండవ ప్రతిజ్ఞ :—

> ''ఓమ్ మమేయమస్తు పోష్యా మహ్యం త్వాదాత్ బృహస్పతిః
> మయా పత్యా ప్రజావతీశం జీవ శరదశ్శతమ్''

''ఆ పరమాత్మ నిన్ను నాకు ప్రసాదించినాడు. నిన్ను నేను పోషింతును. వధూ! పతివగు నాతోకూడి సంతాన

సౌఖ్యములు బడసి నూరు వత్సరములు మనుము.'' ఇట పతియొక్క పత్నీభరణ పోషణ ప్రతిజ్ఞ నుడువబడినది.

మూడవ ప్రతిజ్ఞ :—

''ఓమ్ అమోఽహమస్మి సా త్వగ్ంసా త్వమస్యమోఽహమ్, సామాహమస్మి ఋక్త్వం, ద్యౌరహం, పృథివీత్వం, తావేవ వివహావహై, సహ రేతో దధావహై, ప్రజాం ప్రజనయావహై, పుత్రాన్ విన్దావహై బహూన్, తేసంతు జరదష్టయః సంప్రియౌ రోచిష్ణూ సుమనస్యమానౌ, పశ్యేమ శరదశ్శతమ్, జీవేమ శరదశ్శతం, శృణుయామ శరదశ్శతమ్.''

పార. కాం. ౧ కం. ౬. ౩.

''వధూ! జ్ఞానపూర్వకముగ నిన్ను నేను పాణిగ్రహణ మొనరించుచున్న యట్లు నీవును నన్ను పరిగ్రహింపుము. నేను సామవేద సదృశుడను. నీవు ఋగ్వేద తుల్యవు. సూర్యునివలె వర్షించువాడను నేను. పృథివివలె గ్రహించుదానవు నీవు. మన మిరువురము ప్రణయ ప్రసన్న హృదయములతో పరిణయమగుదము. ఏకీభావము జెంది, వీర్యధారణ మొనరించి ఉత్తమోత్తమము, బలిష్ఠమునగు సంతానమును బడయుదము. ఆ సంతానము వృద్ధాప్యము ప్రాప్తించువరకు సజీవముగ నుండుగాక! మన మన్యోన్యము కలసి మెలసి నిర్మలము, ఆనందమయము, రుచిరమునగు హృదయములతో సద్విషయముల వివేచించుచు, సత్కర్మల నాచరించుచు శతవత్సరములు అన్యోన్య శ్రవణ–విలోకన–జీవనములు కలిగి, ఏకత్రావస్థాన సౌఖ్యసౌభాగ్యముల నోలలాడుదుముగాక! అని వధువుతో వరుడు ప్రతిజ్ఞ చేయుచున్నాడు.

నాల్గవ ప్రతిజ్ఞ:—

"ఓం అర్యమణం దేవం కన్యా అగ్నిమయక్షత
సనో అర్యమా దేవః ప్రేతో ముఞ్చతు మా పతేః స్వాహా
ఇదమర్యమ్ణే అగ్నయే ఇదం న మమ" పార. కాం. ౧ కం ౬

"తేజస్వియు, ధర్మస్వరూపుడునగు పరమాత్మ నన్ను పితృకులమునుండి విముక్తనుగావించి పతికులానుసక్తను గావించుగాక!" అని కన్యక దైవమును ధ్యానించును. కన్యక లాజహోమ మొనరించుచు పతికులమునుండి వేరు గాకుండుటకు చేయు నీ ప్రతిజ్ఞ వైదిక వివాహమున గల అవిచ్ఛిన్న దృఢబంధమునకు ప్రబల ప్రమాణము.

ఈ విధముగనే పతియు తాను పరిగ్రహించిన సతి స్వకులమును వీడి వేరుగాకుండుటకు చేయు ప్రతిజ్ఞయొకటి ఋగ్వేదమున గలదు.

"ఓం ప్రత్వా ముంచామి వరుణస్య పాశా
ద్యేన త్వా బధ్నాత్సవితా సుశేవాః
ఋతస్య యోనౌ సుకృతస్యలోకే౽
రిష్టాన్త్వా సహ పత్యా దధామి"

"ఓం ప్రేతో ముంచామి నాముతః
సుబద్ధా మముతస్కరమ్
యథేయ మింద్రమీఢ్వః సుపుత్రా సుభగా సతీ"

ఋ। మ। ౧౦। సూ। ౮౫। మం। ౨౪-౨౫

ఐశ్వర్యశాలీ! పరిణీత పురుష ప్రవర! ఈ వధువు సౌభాగ్యవతియు, సంతానవతియు నగునట్లు ప్రయత్నించుచు

నీ మెకు ధైర్యము నిట్లు నుద్బోధింపుమని వరుడు ఆజ్ఞాపితుడై యుండినందున "వధూ! నిన్ను పితృకులమునుండి విడివడ జేయుచు, పతికులమున లగింప జేసికొనుచున్నాను. ఈ పతి కులముతోడి నీ సంబంధము శాశ్వత సంబద్ధమై, అవిచ్ఛిన్నమై తనరుగాక" యని ఏకాంతమున స్వ వధువునకు ధైర్యము గఱపుచు ప్రతిజ్ఞ గావించుచున్నాడు.

ఐదవ ప్రతిజ్ఞ :—

సాప్తపదిక క్రియాద్వారమున వధూవరులు ఇందు గావించు శపథముల (విధుల) నేడిటిని విపులముగ వివరింతును.

"ఓం ఇషఏకపదీ భవ। సా మా మనువ్రతా భవ।
విష్ణుస్త్వానయతు పుత్రాన్।విందావహై బహూంస్తే సంతుజరదష్టయః" ౧

"అయి కన్యే! సంతానముకొఱకు నీవొక యడుగు నిడుము. నీవు నా కనుకూలవ్రతవు కమ్ము. ఈ ఆనుకూల్య వ్రతానుష్ఠాన శక్తిని సర్వవ్యాపియగు భగవంతుడు నీకు ప్రసాదించి సహాయపడునుగాక! సర్వైశ్వర్య నిదానము, బలిష్ఠము – శతాయుష్య సంపన్నము నగు సంతానమును మన మిరువురము ప్రాపించుదముగాక!"

"ఓం ఊర్జే ద్విపదీ భవ" ౨

"జవసత్త్వ సంపాదనమునకు రెండవ యడుగు నిడుము."

"ఓం రాయస్పోషాయ త్రిపదీ భవ" ౩

"ధనైశ్వర్యముల సంరక్షణమునకు మూడవ యడుగు నిడుము."

"ఓం మయో భవాయ చతుష్పదీ భవ" ౪

"సుఖప్రాప్తికయి నాల్గవ యడుగు నిడుము."

"ఓం ప్రజాభ్యః పంచపదీభవ" ౫

"సంతాన ప్రాప్తి - పాలన పోషణములకు అయిదవ యడుగు నిడుము."

"ఓం ఋతుభ్యః షట్పదీ భవ" ౬

"షట్ ఋతువుల యానుకూల్య సిద్ధికి యారవ యడుగు నిడుము."

"ఓం సఖా సప్తపదీ భవ" ౭

"అయి! ప్రియే! స్నేహ సంపాదనమునకు నేడవ యడుగు నిడుము." ఇట హేతుగర్భితమగు సంబోధనమును గమనింపుము.

అన్నము, బలము, ధనము, సుఖము, శాంతి, సంతానము, ఋత్వానుకూల్యము, దాంపత్యమైత్రి యను నివి గార్హస్థ్యమునకు పరిపూర్ణ పుష్టిని, సమగ్ర సౌందర్యమును గూర్చునవి యగుట దంపతు లెపుడును వీనిని స్మరణ పథమున నుంచుకొనవలయును. వీని సిద్ధి నాకాంక్షించి వధూవరులు ప్రతిజ్ఞాపూర్వకముగ చేయు ప్రయత్నమునే పురుషార్థమందురు. గార్హస్థ్య - పురుషార్థముల రెంటికిని అక్షరభేదముతక్క అర్థభేద మేమాత్రమును లేదు. పురుషార్థము పూర్వోక్తమగు వస్తుసప్తక సంసిద్ధియందే యంతర్భూతమై యుండును. ఈ సప్తవిధములగు నర్థములు నుత్త

రోత్తరము ఉత్తమ పురుషార్థసాధకము లగును. అందువలననే అంతిమధ్యేయమగు సఖ్యప్రాప్తికి ఏడు అడుగుల నిడవలసి వచ్చుచున్నది.

ఆరవ ప్రతిజ్ఞ :—

"ఓం మమవ్రతే తే హృదయం దధామి
మమ చిత్త మనుచిత్తం తే అస్తు
మమ వాచ మేకమనా జుషస్వ
ప్రజాపతిష్ట్వా నియునక్తు మహ్యామ్."

"నీ హృదయమును నావ్రతానుకూల్యమునకు ధరింతును. నీ-నా చిత్తములు అన్యోన్య మనుకూలించునుగాక. నా మాటను లక్ష్యముంచి వినుము. ప్రజాపతియగు పరమాత్మ నిన్ను నాకై నియోగించునుగాక." ఇది వధూవరులు పరస్పరము సంబోధించుకొనుచు చేసికొను ప్రతిజ్ఞ. పత్నీపతు లనుకూలమనస్కులై లోబడి ప్రవర్తింపనంతదనుక గార్హస్థ్యము చరితార్థము కానేరదు; అన్వర్థమును గాదు. గార్హస్థ్యమును సుఖప్రపూర్ణము గావించుకొనుటకు ఈప్రతిజ్ఞ యొనరింపబడును.

ఏడవ ప్రతిజ్ఞ :—

"ఓం లేఖాసంధిషు పక్ష్మస్వావర్తేషు చ యాని తేతాని తే
పూర్ణాహుత్యా సర్వాణి శమయామ్యహం స్వాహా."
ఇదం కన్యాయై - ఇదం న మమ. ౧
ఓం కేశేషు యచ్చ పాపక మీక్షితే రుదితే చ యత్ తాని..."॥ ౨
ఓం శీలేషు యచ్చపాపకం భాషితే హసితే చయత్ తాని॥ 3

ఓం ఆరోకేషు దంతేషు హస్తయోః పాదయోశ్చయత్ తాని॥ ౪
ఓం ఊర్వోరుపస్థే జఙ్ఘయోః సంధానేషు చ యాని తే తాని॥ ౫
"ఓం యాని కాని చ ఘోరాణి సర్వాంగేషు తవాభవన్.
పూర్ణాహుతిభిరాజ్యస్య సర్వాణి తాన్యశీశమం స్వాహా.
ఇదం కన్యాయై - ఇదం న మమ॥" ౬

"వధూ ! నీకరచరణాది సకలావయవముల యందు సంభవిల్లు సకలవిధజాడ్యములు, రోగములు నుపశమించుటకు నే నీ ఘృతమును ఆహుతించుచున్నా"నని వరుడు వధువుతో ప్రతిజ్ఞ చేయుచున్నాడు.

ఎనిమిదియవ ప్రతిజ్ఞ :—

"ఓం ధ్రువమసి ధ్రువాహం పతికులే భూయాసమ్
(అముష్య అసౌ) గోభిల. గృ. ప్ర. ఖం. 3 సూ. ౮.

వరుడు తనకు ధ్రువారుంధతీ నక్షత్రముల జూపించుట యందుగలభావమును గ్రహించి వధువు ఈ ప్రతిజ్ఞావచనమును పలుకుచున్నది.

"ఓ ధ్రువనక్షత్రమా ! విశాల గగనాంగణమున నీవు వహించియున్న నైశ్చల్యమునే పతికులమున నాకును ప్రసాదింపుము."

"అరుంధతి ! సప్తఋషి మండల నైకట్య భాగధేయమును సదా నీవు ప్రాపించియున్నట్లు నాకును పతికులముతోడి స్థిరము - సన్నిహితమునగు నైకట్యసంబంధము కలుగునట్లు అనుగ్రహింపుము." ఇది వివాహమునగల సుదృఢము-నవిచ్ఛిన్నమగు గాఢానుబంధమును చాటుచున్నది.

తొమ్మిదియవ ప్రతిజ్ఞ :—

"ఓం యదేతద్ధృదయం తవ తదస్తు హృదయం మమ॥
యదిదంగ్ హృదయం మమ తదస్తు హృదయం తవ॥ ౧

మంత్ర. బ్రా. ౧. ౩. ౮.

"నీ - నా హృదయములు పరస్పరము నైక్యభావమును బొందునుగాక !"

పదియవ ప్రతిజ్ఞ :—

"ఓం ఇహారంతిః స్వాహా॥ ఇదమిహారంత్యై ఇదం న మమ॥
"ఓం ఇదం రమస్వ స్వాహా॥ ఇదమిహ రమాయ ఇదం న మమ॥"

మంత్ర. బ్రా. ౧. ౬. ౧౪, గోభి. ౨౪. ౧౦

ఇట ననురాగాంకురములు సాంద్రముగ మోసులెత్తునుగాక ! తరుగని - విరుగని బీరము, దీమసము నన్నెప్పుడును చేరియుండును గాక ! నా అంతరంగ క్షేత్రము నందే నీవు సంతతము రమింతువుగాక !

## దంపతులు - కౌటుంబికులు

గార్హస్థ్యమున ప్రవేశించిన వధూవరులకు, ఆ కుటుంబమునకు జెందిన వారికిని పరస్పర ముండవలసిన సంబంధ బాంధవ్యములను వేదము చక్కగ నుపవర్ణించినది.

నవవధూ ! పతిగృహమున క్రొత్తగా అడుగుపెట్టిన వైదికయుగమునాటి ఆర్యవధువునకు జరుగు మర్యాద - మన్ననలు - దీవెనలు - వేడుకలు ఒకమారారయుము.

"ఓం సా మ్రాజ్ఞీ శ్వశురే భవ సామ్రాజ్ఞీ శ్వశ్ర్వాం భవ
ననాందరి సామ్రాజ్ఞీ భవ సామ్రాజ్ఞీ అధిదేవృషు."

ఋ. ౧౦. ౮౫. ౪౬.

"ఓ వధూ! అత్తమామలకు, ఆడుబిడ్డలకు, బావమరదులకు నెల్లరకు సామ్రాజ్ఞివి కమ్ము."

గార్హస్థ్య మొక చిన్నరాజ్యము వంటిది. నీ వీ రాజ్యమున నడుగువెట్టితివి. ఇందుగల యజమాన ప్రభృతి భృత్యవర్గమంతయు నీ యధీనమున నుండును.

"ఓం యథా సింధుర్నదీనాం సామ్రాజ్యంసుషువేవృషా
ఏవాత్వాం సమ్రాజ్ఞ్యేధిపత్యుర స్తంపరేత్య."

అథ ౧౪. ౧. ౪౩.

నదీసామ్రాజ్యమునకు సముద్రు డధిపతి యయినట్లు ఈ పతికుల సామ్రాజ్యమునకు నీవు సమ్రాజ్ఞివి కమ్ము!

ఈ ప్రమాణములబట్టి గార్హస్థ్యాశ్రమమున వధువునకుగల పదమును, ప్రాధాన్యమును ప్రకటితము లగుచున్నవి

వధువు గార్హస్థ్య సామ్రాజ్యమున మహారాణి పదము నధిష్ఠించిన పిమ్మట గలుగు జ్యేష్ఠ పురుష సంతానమునకు వివాహమై సంతానము ప్రాప్తించుదనుక దంపతులు గార్హస్థ్యము నెఱపి, పిమ్మట వానప్రస్థస్వీకారమునకు వనభూములు చేరవలయును. కాని నేడట్లు జరుగక మర్యాదోల్లంఘన మగుచున్నది. పుత్రకళత్రాది వ్యామోహపాశముల జిక్కి నేటివారు కర్తవ్య కర్మ విదూరులగుచున్నారు. ఈయనియత వ్యామోహ బంధమువలన అనవసరముగ నిర్జీవమగు

జనసంఖ్యయు పెరిగి సమాజమున నశాంతి-నసహనములు చెల రేగుచున్నవి. ఆర్థిక దురవస్థలు అధికమగుచున్నవి. సమాజమున అనర్థపరంపరలకు అవధియే లేకపోవుచున్నది. ఇన్ని చెఱుపులకు మూలమగు నేటిగృహస్థులు కేవలము సమాజ విద్రోహులు. "వార్ధకేమునివృత్తీనాం" అను వైదిక భారతీయాదర్శానుసారము ప్రాచీనకాలమున గృహస్థులందరు ఏబది యేండులు పైబడకముందె సంసారము నుజ్జగించి, అడవుల బట్టుచుండెడివారు. నేడో కాటికి కాళ్ళు చాచిన వారు కూడ కన్యకల పాణిగ్రహింప కేలు చాచుచున్నారు. అహో! పావన భారతీయ ఋషిసాంప్రదాయమున కెట్టి దురవస్థ !!!

## వధువు - చరమలక్ష్యము

"ఓం అఘోరచక్షు రపతి ఘ్న్యేధి శివా
పతిభ్యః సుమనాః సువర్చాః
వీరసూర్దేవృకామా స్యోనా శం -
నో భవద్విపదే శం చతుష్పదే" ఋ. మ. ౧౦-౮౫-౪౪

వధూ! నీవు పతితో విరోధింపక, ప్రణయార్ద్రీభూత సౌమ్యదృష్టి కలదానవుకమ్ము. పశుపక్ష్యాదుల కష్ట సుఖములను కరుణ హృదయమున బరికింపుము. మధు హృదయులు, విమలజీవనులు, తేజస్వులునగు సుపుత్రుల ప్రసవించి వీర ప్రసవాభిధేయమును బడయుము. చిరకాలము సౌభాగ్య సౌమాంగల్యముల సుఖింపుము. పరిజనమును ఆదరింపుము. బంధువులను ఉచితమర్యాదల సత్కరింపుము. అతిథి అభ్యాగతుల గౌరవింపుము. సదాచారము, సత్కర్మప్రవణత కలిగి

పతికులమున విశేషసేవ యొనరించి దానిని సుఖాలవాలము గావింపుము. పతికులమే నీకు ఏడుగడ. అదియే నీకు స్థిరము. దానినుండి ఎడబడలేవు; మున్నగు అర్థవత్తరములగు ప్రవచనములతో సతీకర్తవ్యముల వైదిక వాఙ్మయము వివిధ రీతుల ప్రవచించుచున్నది. విజ్ఞులు పవిత్రభక్తి మయ భావమున సోమరసమును గాంచునట్లు సతిని బతియు నట్టి భక్త్యనురాగ భరిత దృష్టిని గాంచవలయునని వేదవచనము.

ఇట్టి పవిత్రసంకల్పములను, సదాచారములను ఆదర్శమున బెట్టుకొని ఆచరణమున బెట్టగలిగినందుననే ప్రాచీన గార్హస్థ్యములు ఆనందమయములు, సుసౌఖ్యవాసితములు నయినవి. నేడును ఆసరణులనే ఒరవడిపెట్టుకొని ప్రవర్తించుచో తిరిగి భారతీయ గార్హస్థ్యజీవనము సురభిళ దివ్యప్రసూనముల ప్రసవింపగలదని సుదృఢమగు నాశ కలదు. గార్హస్థ్యమన నేమియో దెలియక, అందుగల బాధ్యతల గురుతింపక, కామపాశ నిబద్ధులై యౌవనమదవాసనలకు లోగి యీ యాశ్రమమున నడుగువెట్టువారు కేవలము భయంకర ఘోర దుర్దశల పాలగుటయేగాక నరకయాతనల కూడ ననుభవింతురు. కాని కళ్యాణి! భయమున కంపింపవలదు, వైవాహిక మహాత్మ్యమును ఆమూలాగ్రముగ నాకలించినవారికి అది కోమల సౌరభకిసలయ ప్రసవ పర్యంకము. దివ్యైక భోగ్య సుధాభాండము. అనర్ఘమణి మరీచికా మండిత శీతల స్వర్ణ మందిరము. బెదురుపడక హృదయమును గుదురు పఱచుకొని అందు అంచితాంచితముగ అడుగుల నిడుము. దివ్యసుఖముల కలకాలము ప్రియునిగూడి బడయుము.



# ఆర్య గృహిణి

## ద్వితీయ దళము

అమ్మాయీ!

ప్రథమ దళమున గార్హస్థ్యజీవనమును, సతీపతులయు-ఇతర కౌటుంబికులయు పరస్పర సంబంధమును గురించి దిక్ప్ర దర్శకముగ ప్రస్తావించియుంటిమి. ఇక నిట స్త్రీపురుషుల పారస్పరిక వ్యవహారముల గురించి ప్రస్తావింపదలచుచుంటిమి. ఓపికతో- ఓరిమితో దీనింగూడ వినవలతుము. ఈ ఘట్టమును ఒకటి-రెండు అభ్యాసములతో విభాగింతుము.

### మొదటి అభ్యాసము :—

"నా వ్రతములో నీ హృదయమును ధరించుకొందును. నా నీ మనస్సులు పరస్పర మనుకూలించునుగాక! ప్రజాపతియగు పరమాత్మ నిన్ను నాకయి నియుక్తము జేసినాడు. నా యీ మాటలను ధ్యానముంచి వినుము" అని సతీపతులీభావమహత్వ గర్భితమగు వచనముద్వారమున ఒకరినొకరు బంధించుకొనుచున్నారు.

### వ్రతమహిమ

ఇట ప్రయుక్తమయిన "వ్రత" శబ్దము నిస్సీమమహిమోపేతము; అతి గంభీరభావ ప్రపూర్ణము; కాని ప్రపంచ వ్యవహారమున దీని యర్థము అన్నము ముట్టక కడుపు కట్టికొను

టగా  పర్యవసన్నమయినది.  ఏ సుదినములందో - ఏ సుముహూర్తములందో  భగవదుపాసనాచ్ఛలమున  అన్నపానీయములు ముట్టక వ్రతములు సలిపి భగవత్పూజ గావించుకొంటి మని సంతసింతురు.  వారి మానసిక భావము లెట్లున్నను, క్రియా కలాపము లెట్లున్నను ఈ నిరాహారవ్రతములు పట్టినంత మాత్రముననే తాము కృతార్థుల మయితిమని పాపము! వారి తలంపు. వారికి ఆకాంక్షిత ఫలములు ప్రాప్తించినను - ప్రాప్తింపక పోయినను, ఆకలిదప్పులతో నవసి నవసి యుంటవలన అవయవపటుత్వము తప్పి అనారోగ్యము మాత్రము తప్పక ప్రాప్తించును. ఇట్టి నిరాహార వ్రతములు చేయుటవలన వారికి కలుగు ఫలములు పూర్ణానుస్వారములు. ఫలశూన్యములగు నిట్టి ఉద్యమములు వనితా సమాజములందు జలపతిత తైలబిందువువలె సహసా వ్యాపించును. కావుననే నేడు మన వనితా సమాజములందు మూఢవిశ్వాసముల వలన నీ వ్రతములు నానాటికి పెచ్చుపెరిగి పోవుచున్నవి. వారు తమ విశ్రాంతి కాలమునంతయు నిట్టి కొఱమాలినవానియందె వినియోగించుటవలన జ్ఞానార్జనము కూడ బొత్తుగ కఱవయినది. కావున వ్రతమున గల యాథార్థ్యమును వీరు గమనింపలేక, ఆచరణమున పెట్టలేక పోవుచున్నారు. ఏదేని ఒక పవిత్ర సంకల్పమును క్రియారూపమున నిశ్చలముగ నమలుజరుపగల దీక్షాబలమునే వ్రతమని వ్యవహరింతురు. ఇది సామయికము, సమ్మిళితము నని రెండు తెఱగులు. సామయికము వ్యక్తిధర్మములకు సంబంధించియుండును. సమ్మేళితము సామాజిక ధర్మములకు సంబంధించి యుండును.

బ్రహ్మచర్యవ్రత పరిపాలనము కేవలము బ్రహ్మచారులకే విహితము. సంతానప్రాప్త్యనుష్ఠానము కేవలము గృహస్థులకే కరణీయము. కావున నివి సామయిక వ్రతము లనబడును. "ఓ ప్రభూ! నీవు వ్రతములకు అధినాథుడవు; నేను సత్యవ్రతమును పాలింపవలయునని సంకల్పించుకొనుచున్నాను. ఇందు కృతార్థుడ నగుటకు చాలిన శక్తిని ధైర్యమును నాకు ప్రసాదింపుము" ఈ ప్రార్థన సమ్మిళిత వ్రతమునకు జేరినది. ఇందు ముఖ్యోద్దేశము అసత్యము నుజ్జగించి సత్యమును స్వీకరించుటయే. జగత్తున ప్రతివాని హృదయ కుహరమునందును సత్యవాక్క్రియాపరత ప్రబల మగుటయే సమ్మిళితవ్రతపు ముఖ్యార్థము. సత్యమహిమ అనంతము, అగమ్యము. వేదములుకూడ "సత్యేనోత్తభితా భూమిః" అని ముక్తకంఠముగ ప్రవచించుచున్నవి. "సత్య స్వరూపములగు వ్యవహారాచరణములమీదనే పృథివి ఆధార పడి యున్నది." అని పయి వేదమున కర్థము. ఉపనిషత్తులుకూడ "యో వై స ధర్మః, సత్యం వైతత్, తస్మాత్సత్యం వదన్తమాహుః ధర్మం వదతీతి ధర్మం వా వదన్తం సత్యం వదతీత్యేత తద్ధ్యేత దుభయం భవతీతి"

బృహదారణ్యక ౧-౪-౧౪

"సత్యమే ధర్మము. ధర్మమే సత్యము." వాని మతమున వీని రెంటికి భేదము శూన్యము.

ఈ వ్రత స్వీకారమునకు ముందు ఇందుగల కష్ట నష్టములను లెస్సగా విచారించుకొని, మననము చేసికొని, స్థిర

బుద్ధితో, చిత్తైకాగ్ర్యముతో ఆ వ్రతదీక్షా నిర్వహణమునకు కడఁగవలయును.

## వ్రతపాలనోపాయములు

పరిశుద్ధ హృదయముతో పరిపాలింపవలయునని సంకల్పించుకొన్న సత్యవ్రతమును సర్వవిధ ప్రయత్నముల సాధించి పాలింపుము. వ్రత సంరక్షణమున ప్రాణపరిత్యాగమున కేనియు వెనుదీయరాదు. వ్రతాచరణమున కృతార్థతం జెందిన మహాత్ముల పాదపద్మములను ప్రపంచము స్వహృదయారవింద వినతభావ మధుధారాక్షాళితములు గావించి, సర్వస్వమును సమర్పించును. అట్టి మహాపురుషులనే, తదలంకృతమగు జాతినే, దేశమునే అఖిలప్రపంచము స్వాంతరంగ పీఠములందు ప్రతిష్ఠించుకొని యెల్లవేళల భక్తిభరిత చిత్తములతో నీరాజనించును. సత్యమత వైదికధర్మ ప్రచారమునకై వ్రతదీక్షను బూని దయానందమహర్షి పలుకష్ట నష్టములపాలయి, సౌఖ్యసంపదలను తృణవత్ విసర్జించి, ఇల్లు, వాకిలి విడనాడి, బంధుమిత్రాదులకు దూరమై, అడవుల నడయాడుచు, క్షుత్పిపాసలకు నోర్చి, కావిరిక్రమ్మిన అనర్థ పరంపరలకు వెరువక, వెనుదివియని చిత్తముతో తన పరమార్థమును సాధించుకొన్న మహనీయుడు. కడకు స్వవ్రత పరిరక్షణమునకే పగతురు పెట్టిన విషమునుగూడ భుజించి అసువుల గోలుపోయిన ఆదర్శ జీవనమూర్తి. పాషండ మత ఖండనీ పతాకను ప్రతిష్ఠించి, సమస్త పాషండమతముల ప్రపంచ సీమలనుండి పారద్రోలి తన సత్యమత వైదికధర్మమును ప్రచారమొనరించి తాబూనిన వ్రతమున సఫలు

డాయెను. వ్రతశాలినీ! నేడు మన గాంధిమహాత్ముడుగూడ కేవలము భారత మాతృపారతంత్ర్య నివారణ దీక్షావ్రతమును సంకల్పించి,అందుకొఱకై వివిధవిషమపరిస్థితులకు గురియయ్యు, ఆ వ్రతము నుజ్జగింపక ద్విగుణీకృత సంకల్పబలముతో విశ్వము నందలి సర్వజాతులయు మానసిక-శారీరక స్వాతంత్ర్య వికాస రూపకళ్యాణమును సాధించుచుండుట నీవు వినుచుండుట లేదా? అట్లే మహాపురుషులెల్లరు తమ సంకల్పానుసారము విశ్వ కళ్యాణ ప్రదములగు వ్రతముల నవలంబించి, తత్ఫలసిద్ధికి ఆజీవము యత్నించుచునే యుందురు. కావున నీవు కూడ ఈ గార్హస్థ్యాశ్రమమును స్వీకరించి, ప్రపంచ శ్రేయోవ్యాప్తి సాధకములగు వ్రతములబూని కృతార్థురాలవుకమ్ము!

## అ న్యో న్యా ను రా గ ము

ఒండొరుల మన మనసులు గాఢానురాగ లగ్నము లగుగాత! మానవుని మనస్సు లగ్నమగుచోటనుండియే ప్రసన్నతా మధుబిందువులు జాల్వారి, ఆనందాభిరుచుల తనుపార్చును. పత్నీ పతుల మనస్సులు పరస్పరము సం లగ్నము లగుచో వారు ప్రసన్నహృదయు లయ్యెదరు. చిత్తానుకూల్యము వలన వారొండురులకు మమత్వభావము హెచ్చి పరస్పర సంరక్షణ పోషణ భారము లుపచీయ మానము లగును. సతీపతులకు ఐక్యభావము కుదిరిన పిమ్మట ఉన్నతమార్గ గవేషణమునకు దొడగుదురు. ముఖ్యధ్యానము గల వస్తువుపయి మక్కువ హెచ్చు. మక్కువగల వస్తువును ఆదరించి ప్రేమింతురు. అంతియకాక దాని చెప్పుచేతల

వర్తింతురు. విశ్వసింతురు. కావుట ఈ భావములు పరిణతము లయిన పత్నీ పతులకు కలహములు దూరమై, అనురాగ విశ్వాస మమత్వములు అధికములగును.

రెండవ అభ్యాసము :—

సతీపతు లిరువురు తమ నేత్రములను మధుమయములు గావించుకొని, ప్రణయ కటాక్ష వీక్షణములతో పరస్పరము వీక్షించుకొనవలయును. తమ హృదయముల ప్రేమ కుదురు కొనునట్లు చేసికొనవలయును. పరస్పర హృద్గతులయిన సతీపతులకు కాలుష్య కలహములు లేక సౌఖ్యశాంతులు సంధానమగును. ఒకరిపయి నొకరికి వక్రదృష్టియు, అవిశ్వాసమును నుండుట అనర్థమూలకము. వక్రదృష్టికి కోపము మూలకారణము; కావున నెన్నడును, కోపమును దరిజేరనీక ప్రసన్న సౌకుమార్య హృదయములతో దంపతులు ప్రవర్తింపవలయును.

## పత్నీవ్రతము

అయి! పతిమయ జీవితే! పాతివ్రత్య ధర్మము స్త్రీలకు ముఖ్యాతి ముఖ్యమయినట్లు పత్నీవ్రత ధర్మమును పురుషులకు ముఖ్యాతి ముఖ్యము, విహితము నైనది.

"అహం వదామి నేత్త్వం సభాయామహత్వం వద
మమేద సస్త్వం కేవలో నాన్యాసాం కీర్త యాశ్చన"

అథ ౭. ౩౮. ౪.

"నీవు ఏకాంతమున నే కాంతతోడను మాట్లాడ వలదు. కాని సభాసమూహములందు నిస్సందేహముగ

మాట్లాడుము. నీవు మదీయుడవై వర్తింపుము. ఇతర స్త్రీ నామములను కలలోనైన తలంపవలదు." తన భర్తృనామము వినా పరపురుషుల పేరు తలపకుండుట స్త్రీకి పరమధర్మము అవశ్య కర్తవ్యము నయినట్లు పతికిని తన సతిని వినా పర సతులను దలపకుండుట న్యాయము, ధర్మసంగతము గదా! "మాతృవత్ పరదారేషు" మాతృదేవతవలె పరస్త్రీని పరికింపవలయునన్న ఆర్యోక్తిని ఎల్లప్పుడు ఆత్మగతము గావించుకొని మగవారు ప్రవర్తించుట పాడి. అట్లు ప్రవర్తించి భావి యువకులకు ఆదర్శభూతులు కావలయును. సతుల పాతి వ్రత్యమునకు ఉత్తమ, సౌశీల్యమునకు నిదర్శకములగు కథాంశములు మన ఉద్గ్రంథములం దెన్నియో కలవు. వానిని గమనించి, అట్టి ఆదర్శములనే తమ జీవన సరణికి ఒరవడిగ పెట్టుకొని నడచుకొనుట పురుషులకు కర్తవ్యము. వారి కట్టి ప్రవర్తన కలుగునట్లు కాంతలే హితములు, మనోహరములు నగు క్రియావచనములమూలమున సంస్కరించుకొనవల యును. పురుషుడు తన హృదయమును ఎట్టి ప్రలోభనము లకు లోనుగానీయక స్థిరముగ, అనుద్రిక్తముగ నుండునట్లు చక్కజేసికొనవలెను. అర్థకామములకు సంబంధించినదైనను ప్రలోభనము తగనిదియే. పతి ఈ విషయమున నొక ఆదర్శ రేఖను మునిముందుంచుకొని జాగరూకత గలిగి ప్రవర్తించు కొనవలయును. ఎట్టి సమయములందేని ఆ రేఖోల్లం ఘన మయిన తన ఆదర్శము తిరస్కృత మయినట్లుగను, పతితమయినట్లుగను భావించుకొనవలయును. ఎప్పుడైన తన హృదయము ఆకస్మికముగ పతితమగునట్లున్న, తన

ఆదర్శపు టాధారమున నిలద్రొక్కుకొనవలయును. తన భార్య పరపురుషుని కలనైనను తలపరాదని భర్త తలంచునట్లే, భార్యయు తనభర్త పరస్త్రీలను కలలోనైనను తలపకుండును గాక ! యని ఆకాంక్షించును. ఇట్టి కోరిక మగవారికెట్లు నైజమో, ఆడువారికి నట్లు నైజము. ధర్మసంగతమును, న్యాయానపేతమునుకాని తానీ నియమము సుతరాం పాటింపక తన భార్య మాత్రము తప్పక పాటించి తీరవలయు ననువాడు పరమ మూర్ఖుడు; పత్నీ విద్రోహియు. భర్త ఆదర్శపతితుడయినందున భార్యయు నట్లు కావలయునని మా అభిప్రాయముకాదు. తనసతి ఆదర్శకముగనుండి గార్హస్థ్యమును కూర్పవలయునని గోరుచో, తాను ఆదర్శపతియై భార్యకు సుఖము చేకూర్చుచు, పత్నీ వ్రతధర్మమును మనోవాక్కాయ కర్మల పాలింపవలయునని మా ఆకాంక్షితము. అమ్మా ! ఈ పరిణతి పురుషులయందు ప్రాప్తింపవలయునన్న మీ చనవు మనవులబట్టియు, తీరుతీయములబట్టియే చేకూరును.

పతిదేవుడు పరస్త్రీగామియయినను, రెండవ వివాహము గావించుకొన్నను మన తోబుట్టువులు క్షమా-త్యాగములు, ప్రతిష్ఠా - మర్యాదలు పాటించి యున్నట్లు మరొక్క దేశమున మచ్చునకైనను గానము. కాన ఇట్టి సద్గుణవతులగు మన అక్కచెల్లెండ్రను హృదయ దౌర్బల్యము కలవారనియు, మానసిక దాస్యము కలవారనియు ఇతరులు మందెమేళమాడుదురు. కాని అది యెంతమాత్రమును కానేరదు. ఇది వారిలో గల పవిత్రత. ఈ పతితులగు పురుషుల నుద్ధరింపజాలు దివ్యశక్తి. ఇది మాతృత్వ స్త్రీత్వములను నాళికలనుండి ప్రవ

హించు విమల జీవన వాహిక. పతిత పురుషుల హృదయో సర క్షేత్రముల నీ ఆదర్శజీవన వాహిని ప్రవహించి సస్యశ్యామ లముల నొనరించి విశ్వమునకు సాటిలేని సొబగు గూర్పజాలు మహత్తరాదర్శజ్యోతి. ఇది ఒకపావన భారతావని యందు తక్క మరెచ్చటను కంచుకాగడాలతో గాలించి చూచినను గానము. అట్టి పుణ్యాఖండమున పురాజన్మకృత సుకృత పరిపాకవిశేషమున జనించుట నీభాగధేయము. ఈ ఆదర్శ జీవనవాహినితో నీ భర్తృహృదయ క్షేత్రమును భావశాద్వ లము గావించి, చరితార్థురాలవుకమ్మా! ఇదిగో! వైదిక యుగమునాటి వరునకు జేయు వధూపదేశము ఆలింపుము!

"అభిత్వా మనుజాతేన దధామి మమ వాససా
యథాసో మమకేవలో నాన్యాసాం కీర్తయాశ్చన"
అథ. ౭. ౩౭. ౧.

"సనిగా వివేచించి ప్రణయతంతు పరికల్పిత మగు నా హృదయదుకూలముతో నిన్ను బంధించుచున్నాను. దాన నీవు మమైక్యముం జెందితివి. స్వప్నమున నేని పరస్త్రీ నామముల నుచ్చరింపకుము—"

ఈ ఉపదేశ మర్మములను సమగ్రముగ గ్రహించి నీ గార్హస్థ్యమును గూడ ఆదర్శవంతముగ దిద్ది తీర్చుకొనుము.

## గా ర్హ స్థ్య ము

గృహాలక్ష్మీ! గృహస్థుల పారస్పరిక వ్యవహారముల స్వరూపమును నిరూపించుచు మన పూర్వేతిహాసములు,

ధర్మ-మతగ్రంథములు ఉదాత్త శిక్షణములను ఓతప్రోతము గావించియున్నవి.

"సహృదయం సాం మనస్యమవిద్వేషం కృణోమి వః
అన్యో అన్యమభి హర్యత వత్సం జాత మివాఘ్న్యా"
అథర్వ. ३. ३०. ౧.

"గృహస్థులార! సౌహార్ద్రిత; మానసిక సమత్వము, అవిరోధవ్యవహృతులు నియతనులు. ధేనువు నవజాతవత్స మును ప్రేమించునట్లు మీరు నొకరి నొకరు ప్రేమించు కొనుడు!" అవిరోధవ్యవహృతి యనుటవలన ఒకరి నొకరు ద్వేషించుకొనక సౌమనస్యము కలిగి యుండవలయునని ధ్వనిత మగుచున్నది. ద్వేషము మానవుని సమూలముగ నిర్మూలము గావించు కఠిన పరశువు. మనల నెవరును ద్వేషింపవలదనియు, మన మెవరినిగూడ ద్వేషింపరాదనియు సర్వవ్యాపియగు భగవంతునిగూర్చి ధ్యానింపవలయును. మానవుడు తన చరమలక్ష్యమును ప్రాపించుటకు ఈశ్వర సామీప్యసిద్ధిని బడయుటకును ద్వేషరాహిత్య ప్రవర్తన మొక ముఖ్యసాధనము. ఈశ్వరునకు స్థానము మనోమందిరము. అతడు మలిన మనోమందిరమున క్షణకాలమేనియు నిలిచి యుండడు. కావున ఈశ్వరానుగ్రహ భాగ్యమును బడయ వలెనన్న మనోమందిరములను విశుద్ధములు గావించుకొన వలయును. ద్వేష-కౌటిల్యములను దూరము చేసి, హృదయ మందిరములకు శుద్ధాను రాగాను లేపనము గావింపవలెను. ప్రేమ వైమల్యమున గృహస్థులకు శాంతి-సౌఖ్యములు, ఆనంద-హర్షములు అభివృద్ధిజెందును. వైరుధ్యము, అశాంతి,

ద్వేషము-వక్రత్వము మొదలగు దుర్గుణములు దూరము లగును.

## కౌటుంబిక జీవనము

కుటుంబినీ! మాతా పితలయు, సోదర, సోదరీ మణులయు పరస్పర వ్యవహారములు కౌటుంబికము లన దగును. వీనిగురించి వేద ప్రవచనముల పరిశీలింపుము.

"అనువ్రతః పితుః పుత్రో మాత్రా భవతు సంమనాః
జాయా పత్యే మధుమతీం వాచంవదతు శాంతివాన్"
"మా భ్రాతా భ్రాతరం ద్విక్షన్మా స్వసార ముత స్వసా
సమ్యఞ్చః సవ్రతా భూత్వావాచం వదతి భద్రయా"

"పుత్రుడు పితృదేవుని యాజ్ఞను పాటించువాడుగను తల్లిమాట తప్పనివాడుగను నుండవలయును. భార్య భర్తకు మధురము, శాంతిదాయకము నగు వచనముల వినిపింపవల యును." సోదరులు పరస్పరము సౌహార్ద్ర భావమున మెలగ వలయును. జనులు మర్యాద మన్ననల విడనాడక, ఒకరి నొకరు సౌశీల్యపూర్వకముగ పలుకరించుకొనవలయును. ఇట్లు చేయుట సుందర కౌటుంబిక జీవనమునకు ఆదర్శము. అక్కచెల్లెండ్రు, అన్నదమ్ములు, బావమరదులు, వదినె మర దండ్రు పరస్పర వైరుధ్య ద్వేషములు లేక అనురాగ ప్రపూ ర్ణులయి క్షీర నీరములవలె ఏకీభావమున తనరి ప్రవర్తించిన, అంతకన్న ఆకాంక్షించుకొనదగిన సౌభాగ్యము వేరుండ బోదు. అవిశ్వాసము, మనోమాలిన్యము, అసూయాదులు పరస్పర ప్రేమానురాగ వ్యవహారమున నంతర్ధానములగును.

## భ్రాతృప్రేమ

భగినీ! మన పూర్వేతిహాసముల భ్రాతృప్రేమకు నుత్తమోదాహరణము లెన్నియేని దొరకును. నీవు రామాయణమును చదివియే యుందువు. అందలి భరత లక్ష్మణుల అవ్యాజ సోదరభక్తిని, రాజపుత్రస్థానపు గౌరవపూర్ణమగు రాణాప్రతాపసింహునియొక్క, అతని సోదరుడు శక్తిసింహుని యొక్క సౌదర్య బంధ నిబిడితములయిన చరిత్రాంశముల వినినను, కనినను ఆనందోత్ఫుల్ల రోమాంచ కంచుకిత వగుటయేకాక భ్రాతృప్రేమావర్జితహృదయవుకూడ కాగలవు. కుటుంబముల అభివృద్ధి–నాశనములకుగాని, వంశముల ఉత్కర్షాపకర్షలకుగాని అన్నదమ్ములసఖ్య – వైరుధ్యములే మూల హేతువులు. పసితనమున మన మనోక్షేత్రములబడిన భావాంకూరములు మరణాంతమునగాని మాయముకావు; గాన తలిదండ్రులు తమ బిడ్డల అన్యోన్యపు టైకమత్య సఖ్యములద్వారమున కుటుంబవంశములయొక్క అభివృద్ధి వికాశములగోరి, వారికి చిననాటనుండియు ఆదర్శ భ్రాతృప్రేమానుబంధులగు రామలక్ష్మణులయు, పాండవులయు, ఇతర రాజకుమారులయు అద్భుత కథాకళికలను నుగ్గుబాలతోబోసి, వారి హృదయక్షేత్రములను అసూయాది క్రూరజంతువులు చొరరాని దుర్గమప్రదేశములుగా చేయుట ప్రధానము. తల్లులు ఈ విధ్యుక్తధర్మమును నిర్వర్తించి, తమ సంతానపుటున్నతాదర్శభావ పరిణతికి నెట్లు మూలమాయిరో, రామాయణమును చదివిన ప్రతివానికిని దెలియును. రామాయణమున భరత లక్ష్మణుల నిస్స్వార్థ నిర్మల భ్రాతృభక్తి భ్రాతృ

ప్రేమయొక్క పరాకాష్ఠను జేరినది. వారికి పూర్వమునగాని పరమునగాని లేశమాత్రముగనైనను వారి భ్రాతృప్రేమతో సరిపోల్పదగినది నేటికిని కనబడనులేదు; వినబడనులేదు. అందలి మాతృమూర్తుల శిక్షణముకూడ అనుపమానమైనది; అద్భుతోత్తరమైనదియు. అమ్మాయీ! ఒకమారు దీనిని కథాఘట్టమని పేలవము జూపక ఆలింపుము.

రామరావణ యుద్ధమున లక్ష్మణుడు గాయపడిన తోడనే హనుమంతుడు బయలుదేరిపోయి, సంజీవని కొనితెచ్చుచుండ, మార్గమధ్యమమున భరతుడు వాని కెదురయి, అతడు తన సోదరభక్తుడనియు, తన తమ్ముని ప్రాణములు గాచుటకు ఔషధము గొనిపోవుచున్నాడనియు దెలిసికొని, మిక్కిలి సంతోషించి తన తల్లులకడకు వాని గొంపోయెను. అట తల్లులందరు వానిగూర్చి సీతారామ లక్ష్మణుల కుశలవార్తాసంప్రశ్నము గావించిరి. హనుమంతుడు వారికడ కొంతతడవుండి వారి సెలవు గైకొని మరలి పోవునపుడు నొక దివ్య సందేశమును వాని ద్వారమున తల్లులు రాముని కందించిరి. అది నిత్యము ప్రాతస్స్మరణ యోగ్యమై స్వర్ణాక్షరములతో విలిఖింప దగియున్నది.

## సుమిత్రా సందేశము :—

"రామ! లక్ష్మణుని వనవాస గమనమునకు తల్లిదండ్రులు ఆజ్ఞ యొసగలేదు. అతడు నీకు సేవోపచారముల జేయ నాసించి, కష్టముల సహించి సీతతోపాటు అడవులకు దరలినాడు. నిన్ను దశరథునిగను, మా కోడలు సీతను

సుమిత్రగను తలపోసి, వారిని ఉపచరింపుమని లక్ష్మణునకు నేను ఉపదేశించితిని. అవసరము కలిగిన వారికొఱకు అసువుల నీ పటకుగూడ సంసిద్ధుడవు కావలసినదని హెచ్చరించితిని. ఈ హనుమంతుడు కొని తెచ్చు ఔషధబలమువలన అతడు పునర్జీవితుడు కానిచో నీ వేమియు పొగులవలదు. లక్ష్మణుడు ఉత్తమ సేవకుడువలె తన ధర్మమును నిర్వర్తించుకొని, తన గమ్యస్థానమునకు జేరినాడని సంతసింపుము."

## కౌసల్యా సందేశము :—

"రామ ! నిన్ను నేను అడవులకు నొంటరిగ సాగనంప లేదు. దైవయోగమున మన లక్ష్మణుడు ప్రాణములు గోలుపోవుచో మరల నీవు అయోధ్యదిక్కు మొగము పెట్ట వలదు."

ఈ మాతృదేవతలు ఆదర్శప్రేమ కర్తవ్యముల సజీవ మూర్తులు. వారివలె సోదరీ! నీవును నీ సంతానమును భ్రాతృప్రేమ, ఉత్తమ విద్యాబుద్ధులద్వారమున సుశిక్షితము గావించి ఆదర్శగృహిణివి కమ్ము.

## సాధారణ వ్యవహారము

వృద్ధుల సన్మానించుట గృహస్థుల కర్తవ్యము. ఆయు ర్విద్యా ప్రభేదములచే వృద్ధులు ఇరుతెరగుల ప్రవిభక్తులు. విద్యచే బ్రాహ్మణుడును, బాహుబలముచే క్షత్రియుడును, ధనధాన్యాద్యైశ్వర్యములచే వైశ్యుడును, వయస్సుచే శూద్రు డును వృద్ధులని ఆర్షప్రవచనములు నుడువుచున్నవి. వీరిలో విద్యావృద్ధులు సర్వశ్రేష్ఠులు.

మనుష్యుడు తా ప్రవర్తించు వ్యవహారముల భేద భావము విడనాడి సామ్యమును వహింపవలెను. మఱియు నతడు తన హృదయమునగల మాలిన్యమును వెలికిద్రోయక, సందేహబీజములను పెంచుకొని, తన యంతరంగమున వానికి ఆశ్రయ మిడినప్పుడే భేదభావములు అంతింతలై మోకుతిరు గని మూలములుగల పెనుమ్రాకు లగును. కావున నిట్టి అవాంఛనీయమును, మానవౌన్నత్యమునకు ననర్థదాయ కము నగు నీ భేదమాలిన్యమును స్పష్టవాదిత్వమను నిర్మాలో దకముచే క్షాళితము గావింపవలయును. ఇట్లు వాస్తవిక విషయమును సుస్పష్టమొనరించి, తమ స్పష్టవాదిత్వమును ప్రకటించుటచే ఎట్టివారియెడను భేదభావము పొడకట్టనేరదు. భారత పురంధ్రీ! మరొక్కమాట ; ప్రస్తుతము పాశ్చాత్య నాగరికతా వాహినులబడి మన భూమికి ప్రవహించి వచ్చిన ధనికవాదమువలన అంతకుమున్ను మన సజీవ రక్తనాళము లందు కరుడుకట్టుకొనియున్న "ఈశావాస్య మిదం సర్వ" మ్మను విశ్వమానవ సమాన సౌభ్రాతృత్వమును ప్రతిపాదించు మన ఉపనిషద్వచనములకు వజ్రాఘాతము కలిగినది. ఆనాటి నుండియే మన దృష్టిపథములకు ధనిక - దరిద్రులు, అవర్ణ - సవర్ణులు మొదలగు భేదభావములు ప్రబలి మన పావనార్ష మర్యాదలను నాశనముజేసి, మనలను సంకుచితహృదయు లను గావించినవి. ఇదియంతయు అనాచరణీయమేగాక అనవలంబనీయమునగు వైఖరి యగుటచే ఉన్నతోన్నతము లగు మణిమయప్రాసాదముల వసించు భాగ్యవంతులను వలెనే, కూటికికూడ లేక ఆకటిచిచ్చుతో మలమల మాడిపోవుచు

మార్గములగల చెట్లనీడలబడి అన్నమో, రామచంద్రా! యని అలవటించు నా దరిద్రనారాయణులగూడ ప్రేమానురాగతుందిలితము - గౌరవాదరబృంహితము నగు దృష్టితో చూచి, భగవత్సంతానమగు నీ అఖిలజన సమూహమున నీ సమానప్రేమసహానుభూతుల ప్రకటింపుము.

ఈ సాధారణ వ్యవహారము విషయమున ఉత్తమ సూక్తి రత్నములను పొదిగియున్న వేదరచనములు చాల గలవు. అందొకటి రెంటిని సావధానవై అవధరింపుము.

"యేన దేవా న వియన్తి నో చ విద్విషతే మిథః
తత్ కృణ్మో బ్రహ్మ వో గృహే సంజ్ఞానం పురుషేభ్యః"
(అథర్వ. ౩-౩౦-౪)

భేదభావము ద్వేషోదయమునకు పుట్టినిల్లు. ఇట్టి భావమును దూరీకరించి, ప్రాణిజాలమును అన్యోన్యము సమ్మిళిత మొనరింపజాలు సుస్థిరము, సుమధురము, విద్యాద్యైక్యమునకు హేతుభూతము నగు నొక వ్యవస్థను మీకఱు నియుక్త మొనరించినాడను. గృహస్థులు దీని సావధానులై నీచోచ్చ భావముల విడనాడి, సామ్యదృష్టితో తమ అభివృద్ధి విలాసముల నాకాంక్షించుచుందురుగాక!

"జ్యాయస్వన్తశ్చిత్తినో మా వియౌష్ట
సంరాధయన్తః సధురాశ్చరన్తః
అన్యో అన్యస్మై వల్గు వదన్త ఏత సధ్రీ
చీనాన్వః సంమనసస్కృణోమి." (అథ ౩-౩౦-౫.)

"ఓ గృహస్థులార! ఉత్తమ విద్యాగుణ సంపన్నులు, పండిత ప్రకాండులునై విహరింపుడు! ఒండొరులు కలసి

మెలసి ధనధాన్యరాజ్యసమృద్ధి కలవారై ఆదరానురాగములతో వ్యవహరింపుడు! నిత్యము సత్య మధుర భాషణులరై ప్రవర్తింపుడు! లాభాలాభముల నేకాభిప్రాయము కలిగి, ఒకరి కొకరు సాయము జూపుకొనునట్లు మిమ్ము నియోగించుచున్నాను."

సామాజికోన్నతి దీని యుద్దేశ్యము. విద్వాంసుడైన గృహస్థుడు అన్యుల లాభవృద్ధులతోపాటు తానుగూడ లాభింపవలయును. అందరును కూడిమాడి సమాజ దేశములకు శ్రేయోభివృద్ధుల గూర్చుడు. అవసరములగు వ్యవహారముల నేకాభిప్రాయులరై పరస్పర సహాయకులు కండు!

ఇదిగో! ఈశ్వరీయజ్ఞానమగు వేదోపదేశములను ఆలించితివా? ఇందలి పరస్పరైక్యభావసామరస్య పరిణతిని పరికించితివా? పరికించి హృద్గతము గావించుకొని క్రియారూపమున ప్రదర్శింపుము!

## వి శ్వ ప్రే మ

"సమానీ ప్రపా సహ వో అన్నభాగః
సమానే యోక్త్రే సహ వో యునజ్మి
సమ్యఞ్చోఽగ్నిం సపర్యతారా నాభిమివాభితః"

అథర్వ. 3. 30. 6.

"మానవులార! మీరు కలసి మెలసి భోజన పానాదుల నొకేచోట నిర్వర్తించుకొనుడు! మిమ్ము ఏక శ్రేణినియుక్తులగా నొనరించుచున్నాను. మీరందరు ఒకరి కొకరు చేదోడు వాదో డగుచు అగ్నికర్మల నొనరింపుడు."

"సధ్రీచీనాన్ వః సంమనసస్కృణోమ్యే
కశ్నుష్టీ న్సంవననేన సర్వాన్
దేవా ఇవామృతం రక్షమాణాః
సాయంప్రాతః సౌమనసో వో అస్తు." అథ 3. 30. 7.

"మానవులార! అన్యోన్య సహాయకులనుగ, ఏకాభిప్రాయులనుగ, ఏక క్రియాసాధనా ప్రవృత్తులునుగ, ఉపకారపరులునుగ మిమ్ము నియోగించుచున్నాను."

వైజ్ఞానికులకువలె మీకును మానసిక శుద్ధి లభించునుగాక.

ఇది సామాజ కౌన్నత్యమున కొక మహత్తర శిక్ష. మీరందరేకమై ప్రాతస్సాయంసంధ్యల పరిశుద్ధభావములతో ఇహ పర సౌఖ్యసంపదల సంరక్షించుకొందురు గాక!

మానవులు మాత్రమే గాక సృష్టిలోగల ప్రాణిలోకమంతయు పరస్పరము ప్రేమ విశ్వాసములతో ప్రవర్తింపవలయునని వేదములు ప్రవచించుచున్నవి.

"యో వై కశాయా సప్త మధూని వేద మధుమాన్ భవతి,
బ్రాహ్మణశ్చ రాజన్యం చ ధేనుశ్చానడ్వాంశ్చ వ్రీహిశ్చ యవశ్చ
మధు సప్తమమ్." అథ. ౨. ౧. ౨౩.

"దృతే ద్రుంహ మా మిత్రస్య మా చక్షుషా సర్వాణి భూతాని
సమీక్షన్తామ్, మిత్రస్యాహం చక్షుషా సర్వాణి భూతాని సమీక్షే,
మిత్రస్య చక్షుషా సమీక్షామహే॥" యజు. 36. ౧౮.

"గో, బ్రాహ్మణ, క్షత్రియ, వృషభ, ధాన్యములు, యవలు, మిఠాయి యను నివి సప్తవిధ మధుర పదార్థములు. వీని మాధుర్యము నెరిగినవాడు మధుమంతుడని పిలువ

బడును. దృష్టిస్వరూపుడవగు నో పరమాత్మ! నా దృష్టిని సుదృఢ మొనరింపుము. సర్వప్రాణులను మిత్రదృష్టితో పరికింపగల శక్తి నాకొసంగుము! సర్వప్రాణులు మిత్రదృష్టితో అన్యోన్యము వీక్షించుకొనజాలు మధురదృష్టిని లోకమునకు ప్రసాదింపుము."

వివేకవతీ! పై నుడువబడిన సమస్త వ్యవహార రహస్యములను హెచ్చులొచ్చులు లేక పరిపాలింపజాలుటకు సామాజక నిబంధములను ప్రప్రథమమున నెరుగవలయును. మానవుడొక సామాజక జీవి. సమాజము వినా యాతని జీవితము దుర్భరము. వ్యక్తి, సమాజములకు అత్యంత సన్నిహిత సంబంధము కలదు. వ్యక్తి సామాజక సంస్కారములు సర్వోత్తములైననే గాని లోకమున వారిరువురకు కళ్యాణ మార్గము లభింపబోదు. వ్యక్తి-సమాజములు స్వస్తిపథమును ప్రాపించుట కనువగు ఉపాయము లెన్నియో యిందట నట యించుక తడవబడినవి. మానవుని సంబంధము కేవల మొక దంపతీ కుటుంబ, జాతి, సమాజములతోనే గాక విశ్వంభరావలయమున గల ప్రతిప్రాణితోను అనుస్యూతమునయి యున్నది. వీని పరస్పర సంబంధ శ్రేష్ఠత్వము దయా, ప్రేమ, సహానుభూతులతో నెయ్యము నెరపుచున్నది. జాతి-కుటుంబములు కలసి-మెలసి ప్రవర్తింపవలయునన్న వారిలక్ష్య మొక్కటియై యుండవలయును; కాని మన భారతవర్షమున గల భారతీయార్యజాతి భిన్నభిన్న లక్ష్యములతో ప్రవర్తిల్లుచున్నది. ఇది మనజాతికి తీరని ముప్పుకల్పింపజాలు గొప్ప తప్పు. ఇరువదిరెండు కోట్ల భారతీయార్యులు ఏకకంఠముగ

"ఓం ఖం బ్రహ్మ" యని ఒకే ఆదర్శమును స్థాపించుకొన్న, విశ్వమున అనశ్వరమగు కీర్తి ప్రతిష్ఠలు కలిగి, భారతీయార్య సభ్యతా విజయధ్వజము వియత్తలమున స్వేచ్ఛాతరంగము లతో నూగాడుచు మానవ హృదయముల అమందానందల హరీసంప్లావితముల కావించి మించెడిది; కాని నేటి మనస్థితి దాని కెంతయు భిన్నముగ నున్నది. మన కొక ఆదర్శము లేదు. ఐక్యభావను అసలే నిండుసున్న. వెవ్వేరగు దేవతా ప్రార్థనములు మెండు. ఇటగల వారందరు భిన్న భిన్న వ్యక్తులు. ఇది మిక్కిలి శోచనీయము, దుర్భరమునగు దుస్థితి. ఈ గార్హస్థ్య వివిధరంగములందు సంఘటించు సదసద్విషయ ముల వివేచించి, అందు ఆదర్శమగు సరణి నేర్పరించుకొని మీ దాంపత్య జీవనవల్లరి కోమల సౌరభ మనోజ్ఞ ప్రసవ సంతానముల గాంచి, ప్రజాలోకమును పరిమళ పరీవాసిత మును గావించునట్లు తీర్చి దిద్దికొందువుగాక!

# ఆర్య గృహిణి

## తృతీయ దళము

## గార్హస్థ్య జీవనోద్దేశము

సౌభాగ్యవతీ !

గృహస్థజీవనమునందలి భిన్న భిన్న కర్తవ్యములను విపులముగ వివేచించి, స్త్రీపురుషు లేయే ఉద్దేశముల కైకొని గృహస్థాశ్రమమున ప్రవేశింతురో మూడవ దళమున యథా శక్తి వివరింతును. రెండవ దళమున వివాహ ప్రతిజ్ఞల నుడువుచు, సప్తవిధోద్దేశ పరిపూర్తికయి పరిణయమాడి, గృహస్థాశ్రమమున ప్రవేశింతురని నుడివియుంటిని. వాని నిట ఒక్కొక్కటిగ గొని పరామర్శింతును.

### సంతానోత్పత్తి

కామవాసన మానవునకు నైజగుణము. సముచితమగు దీని నియంత్రణము వాని సుఖజీవన చరమోద్దేశ మగు మోక్షప్రాప్తికి మూలము. దీని సంబంధము కేవల సంతా నోత్పత్తితో నంటియుండునే కాని విశృంఖలతకు దరినైన జేరబోదు. సంతానోత్పత్తి మానవుని కర్తవ్యములలో ప్రధానమైనది. దీనినే పితౄణమందురు. సంతానరూపమగు తన ప్రతినిధిని జాతి-దేశముల గౌరవ ప్రతిష్ఠాపనమునకయి సమర్పించుట మానవుని విహిత కృత్యము. దీననే అతడు

పితౄణ విముక్తుడగును. అట్లు గౌరవ ప్రతిష్ఠాసంపాదనమున కయి అర్పింపబడు సంతానరూప ప్రతినిధి సర్వవిధ ప్రజ్ఞా బలశాలియై ఒప్పారవలయును. "పుత్ర" యను శబ్దము "పు + త్ర" యను ద్వ్యక్షర మేళనముచే నుత్పన్న మయినది. "పు" యను వర్ణమునకు పవిత్రమనియు, "త్ర" యను వర్ణమునకు రక్షించువాడనియు నర్థము. కావున కుటుంబమున గల దోషముల దూలించి, పవిత్రీకరించి దానిని సంరక్షించువారలే పుత్రీ పుత్రులని మన ఆర్ష ప్రమాణములు నుడువుచున్నవి. పవిత్రము, సంరక్షణమనను గుణద్వయ మును తల్లిదండ్రులు తమ సంతానపు హృదయ క్షేత్రముల మోసులెత్తింప వలయును. ఈ గుణ ద్వయమును కలిగి వ్యవ హరించిన తలిదండ్రులే అట్లు చేయ గలుగుదురు. పవిత్రతకు శుచి సదాచారములును, రక్షణమునకు శక్తి - సామర్థ్యము లును అత్యవసరము. తమ సంతానమును నట్టి గుణములే ప్రాపించియున్న మంచిదియ. లేనిచో గుణహీనమగు సంతా నముచే కుటుంబ - సమాజముల కెట్టి విశేష ప్రయోజన మును కలుగబోదు. అంతియకాక అట్టి సంతతి కుటుంబ సమాజములకు కేవల భారభూతమయి మనుష్యరూప మృగములవలె మానవ సమాజమున తిరుగాడుచు, కుటుంబ సమాజములకు నప్రతిష్ఠయు, నపఖ్యాతియుం గూడ దెచ్చును. మహాభారత కాలమున మాతృదేవీమతల్లులు అయోగ్యము, దుర్బలమునగు సంతానమును కనుటయే పాపముగ భావించెడివారు. ఆ ఆఖ్యాయిక నొకదాని నిట వినిపింప పొందు పరతును.

ఒకానొక సమయమున సప్తర్షి మండలము అరుంధతీ సమేతముగ యాత్ర నొనరించుచుండెను. అట్లు యాత్రించుచు వారు ఒకానొక సరస్తీరమునకు చేరిరి. ఆ స్థానమెంతయు సుమనోహరముగ నుండెను. పిదప వారు విందారగింప వలయునను తలంపుతో తామరతూడుల కొన్నిటి కోసికొని, అట వాని నునిచి, స్నానమునకై సరోవరమును జొచ్చి, స్నానవిధి ముగిసినపిదప తీరమున జేరి, విందు గుడుచుటకై మృణాలముల నన్వేషింప జొచ్చిరి. కాని యవి వారికి కానుపింపలేదు. వాని దొంగిలించుకొనిపోవువాని నైనను వీరిలో నెవ్వారును గాంచలేదు. కావున వారిలో వారికే అవిశ్వాసము ప్రబలి, ఒకరినొకరు దొంగగా అంతరంగమున తమలోతాము తలపోయసాగిరి. అట్టితరి వారితో గల అరుంధతీదేవి ఋషిసప్తక సందేహ నివారణమునకయి అనాచారము వలనను, దుర్బలసంతానము కనుటవలనను వాటిల్లెడు మహాఘోర పాతకమే ఈ తామరతూడుల దొంగిలించినవానికిని సంఘటిల్లుగాక! యని శపథము చేసినది. వాస్తవముగ ఆ సమయమున అనాచారము, చౌర్యక్రియ, దుర్బలసంతానము లను నివి సమాన పాతకములుగ తలంపబడుచుండెడివి. ఆ నాటి మాతృదేవీమతల్లులు దుర్బల సంతానము కనుట మహాపాపముగ భావించుచుండెడి వారు; కనుకనే రామ – భీమ, అర్జునాది మహాబలవంతు లగు పుత్రుల కనుచుండెడివారు. కాని నేటి మనతల్లులు తమ కర్తవ్యములు విస్మరించుటచే జీవచ్ఛవము లనదగు దుర్బల సంతానము కనుచున్నారు. దానికి కారణము

సంతానోత్పత్తికి పూర్వము శ్రద్ధాభక్తులతో ప్రయత్నమును గట్టిగ గావింపక పోవుటయే. ప్రయత్నింపడి కనుసంతాన మెన్నటికిని యిట్లు శారీరక - ఆత్మిక బలవిహీనమైనది కానేరదు.

## పుత్రీపుత్ర ప్రాప్తి విధానము

పుత్రీపుత్రులలో తాము వాంఛించినవారిని కనుట కొరకు మనోహరమగు నుపాయము పురాకాలమునుండి పరంపరాచారముగ మన భారతీయార్యసంఘమున ప్రచలితమై యున్నది. ప్రస్తుత మానవలోకము పుత్రీపుత్ర జన్మమును కారణముగా గొని ద్వేధా విభక్త మయినది. ఒకభాగమునకు జెందిన తల్లులు కేవల పుత్రసంతానమును, తక్కినవారు పుత్రీసంతానమును వాంఛింతురు. పాశ్చాత్య మహిళలు పుత్రీ సంతానమునే వాంఛింతురు. దీనికిగల కారణము వివాహానంతరము కష్టపడి కని తమ్ము పెద్దవారలజేసిన తల్లిదండ్రులను తమ పుత్రులు విడనాడి చనుటయే. తమ పుత్రికలకు వివాహమయినను వారితోగూడి సంతోషమున మునిగి తేలుటచే కాలము కఠినముగాక మోదముం గూర్చునదియై ప్రశాంతముగ గడచిపోవును. కావున తమ పరితోషమునకు మెరుగులు వెట్టజాలు పుత్రీసంతానమునే పాశ్చాత్యనారీలోకము అభివాంఛించుటలో గల మూల రహస్యము. ప్రాగ్దేశముల గల మాతృలోకము కేవల పుత్రసంతానమునే అభివాంఛించును. పుత్రులతో గల సంబంధము వీరికి సుస్థిరమయినది.

వివాహముచేసిన తోడనే పుత్రీసంతానము తల్లిదండ్రుల విడనాడి భర్తృగృహములకు నేగును; కావున మాతృపుత్రీ సంబంధము అందదుకయి వారిరువురను వాత్సల్యవల్లరీ సంబద్ధ మొనరింపజాలదు. కావున ప్రాగ్దేశపు నారీమ తల్లులు పుత్రప్రాప్తికయి శిలాదార్వాది జడమయ విగ్రహాభీష్టములగు మందిరములనో, క్రూర కుటిలగుణ సమేతులయి కేవల వేషధారణముచే లోకమును వంచించు వంచక యోగిజనములచే ఆవృతములగు కందరములనో చేరి, అట వీరు మాన ధన ప్రాణములను సైతము విడనాడికొని పుత్రసంతానమునకై పడరానిపాట్లు పడుచుందురు: కాని ఇది వారి అజ్ఞానమనక తప్పదు. పుత్రోత్పత్తికి ప్రాచీన శాస్త్రములు స్వాభావికము, రజోదర్శన సమయ సంగతమునని రెండుగుణముల నభివర్ణించి యున్నవి. సాధారణముగ స్త్రీ రజస్సుకంటె పురుష వీర్య మధికమగుచో పుత్రసంతానము కలుగుననియు, రజస్సు అధికమయిన పుత్రీసంతానము కలుగుననియు మనుస్మృతి సూచుచున్నది. రెండవదగు స్వాభావిక నియమము తల్లిదండ్రుల వయోవైషమ్యమును బట్టి యేర్పడును. జర్మనీయందలి డాక్టర్లు విశ్వప్రయత్న మొనరించి, తల్లిదండ్రుల వయోవైషమ్యముచే పుత్రీపుత్రులు కల్గుదురని నిర్ణయించిరి. ఈ నిర్ణయము వైదిక మర్యాదను సంపూర్ణముగ సమర్థించుచున్నది.

## రజోదర్శనము

మాసమున పదునారు దినములు మాత్రమే ఋతుదానయోగ్యములని చెప్పబడుచున్నవి. ఇవి రజోదర్శ

నముతో ప్రారంభములగును. వీనిలో అష్టమి - చతుర్దశి - అమావాస్య - పౌర్ణమి ఆదిగా గలవానిని పరిత్యజింప వలెను. మిగిలినవానిలో మొదటి నాలుగు రాత్రములును ఋతుదానమునకు అయోగ్యములు. ఇవి గాక విషమ సంఖ్యలుకూడ పరిత్యాజ్యములు. పుత్ర సంతానను నభివాంఛించువారు సమ సంఖ్యాకములగు రాత్రములయందు ఋతుదాన మొనరింపవలయును. కన్యా సంతానమును కోరు వారలు విషమ సంఖ్యలుకల రాత్రములందు ఋతుదానము చేయవలెను. దివామైధునము సర్వథా పరిత్యాజ్యము. ప్రాణవాయువు నశించి శక్తి క్షీణించుటయే దివామైధున నిషేధమునకు కారణము. ఋతుదాన మెల్లప్పుడును అర్ధ రాత్రమునందే చేయుట సర్వథా సముచితము. గర్భవతి యైన పిదప స్త్రీని యెన్నడును కవయరాదు. సంతానోత్పత్తి యైన పిదప నొక సంవత్సరము వరకు భార్యాభర్తలిరువు రును బ్రహ్మచర్యమును పరిపాలింపవలయును.

## జన్మశాసనము

ఇంద్రియదాస్య పరిణామమే సంతానోత్పత్తి. దాని పరిపోషణమెంతయు ఆనందదాయకమే యయినను కష్ట భూయిష్ఠము కావున మనుష్యుడు కామవాసనల తృప్తికయి ప్రయత్నించుచు సంతాన నిగ్రహోపాయముల నెమకు చుండును. అతడు సంతతి నిగ్రహమునకై అనార్యములగు కృత్రిమోపాయముల నెన్నింటినో చేపట్టెను. పాశ్చాత్య ఖండము సంతతినిగ్రహ కృత్రిము సాధనములకు జన్మదాత.

పాశ్చాత్త్యు లెందరో భారత వర్షమున ప్రవేశించి సంతతి నిగ్రహ సాధనములను ప్రచారమునకు దేవలయునని విశ్వ ప్రయత్నములు జేసిరి. కాని ఆర్షసంతానమగు భారతి యార్యజాతిలో వారి ప్రచార మెంతయు మోఘమాయెను. ఇటుగల విద్వాంసులదృష్టిలో సంతతి నిగ్రహ కృత్రిమ సాధనము లెంతయు దూషితములు; కాని దౌర్భాగ్యవశమున శిక్షితులమని, ధనికులమని విఱ్ఱవీగు పాశ్చాత్త్య సభ్యతాలోలు రగు కతిపయభారతీయ శిఖామణులు ఈసాధనముల నాహ్వానించి ఉపయోగింప సాహసించుచున్నారు. అంతియేగాక జన సామాన్యమును గూడ ఈ సాధనముల నుపయోగించుటకు తేనుంకించుచున్నారు. ఆంగ్లభాషాధ్యయన మొనరించిన స్త్రీ పురుషులు అధికముగ నీసాధనము లుపయోగించుచున్నట్లు తెలియవచ్చుచున్నది. ఈ మార్గ మెంతయు సదాచార భంజ నము; ఆరోగ్య విధ్వంసకము. దీనివలన జాతి - దేశములు సత్సంతానవిహీనములై జీవచ్ఛవముల కాకరమగును. ఈ పాశ్చాత్త్యానుకరణ మెంతయు మన దేశమునకు తీరనిముప్పు తెచ్చిపెట్టక మానదు.

వివాహితులు సంతతి నిగ్రహముద్వారమున తమసుత్పత్తికి వేరుపురుగులై ప్రవర్తించుచున్నారు. అవివాహితులు ఉపర్యుక్త కృత్రిమ సాధనముల ద్వారమున సంతానమును వినష్ట మొనరించుచున్నారు. వీని రెంటను జనసంఖ్య క్రమక్రమ ముగ క్షీణించి, జాతి - దేశములు దుర్బలములుగాక తప్పదు. సంతాన నిగ్రహమున కలవాటుపడియున్నందున పాశ్చాత్త్య దేశము లొకనాఁడు జనసంఖ్యాభివృద్ధికయి పడరాని పాట్లు

పడియున్నవి. అవివాహితులనుండి పన్నును వసూలు చేసినవి. వివాహితులయి సంతానమును బడయువారికి వేలకొలది ధనమును పంచిపెట్టియున్నారు. మరియు అధిక సంతానమును కనుటకయి, పాశ్చాత్య ప్రభుత్వములు మన ప్రజలను ప్రోత్సహించియున్నారు. కావున జన్మశాసన విధానమును ఆర్యభూమియగు భారతవర్షమున ప్రచారమునకు దేనిక నిరోధింప స్త్రీ-పురుషులు కటిబద్ధులు కావలయును.

సంతతి సంఖ్యావిషయమున పదుగురను కనుటకు వేదము లనుజ్ఞ యిచ్చుచున్నవి; కాని శారీరక ఆర్థిక కష్టములకు లోనైనవారు సంతాన నిగ్రహమును చేయదలంచుచో వారు తమ కామవాసనల నరికట్టవలయును. సంపూర్ణముగ బ్రహ్మచర్యమును పరిపాలింపవలయును. ఇవి రెండే సంతతి నిగ్రహమునకు సర్వోత్తమమగు నుపాయములు.

## ధన సంపాదనము

అయి! త్యాగశీలే! ఇది గృహస్థుని రెండవ లక్ష్యము. సంతతోద్యోగముచే ధనమును సంపాదించి, దానిని సంరక్షించు నధికారము ఒక్క గృహస్థునకే గలదు. అట్లు చేయుట వాని కర్తవ్యము. ఈ తత్వము నెఱిగినవారు ఏ కొలదిమందియో గలరు. కాని మన దేశమున జగన్మిథ్యావాదము ప్రబలి ప్రజలను, విరక్తులను, అకర్మణ్యులను పురుషార్థ విహీనులుగను నొనర్చివైచినది. జగన్మిథ్యామూలక మనోవృత్తిగల మానవులు సర్వాశ్రమ మకుటాయమానమగు గార్హస్థ్యమున ప్రవేశించినను అందు వారి

కెన్నటికిని చారితార్థ్యము చేజిక్కబోదు. గార్హస్థ్య నిరపాయ నిర్వాహణమునకు ధనము మూలము. ధనోపార్జనావిషయమున మహాభారతమున నొక నీతి చెప్పబడియున్నది. విద్యా ధనముల నార్జించు మానవుడు తనను అజరామరునిగా భావించి ధనమును గూర్చవలయును. పిదప మృత్యువు సాన్నిధ్యముననే తనకై వేచియున్నదని తలచి, సంపాదించిన ధనమును పరోపకారమునకై విరివిగ దానముచేయవలెను. ప్రస్తుతము ధన ధర్మ విద్యా సంపాదనమునకు తగినయుపాయముల విరివిగ ప్రచారముచేసి జగన్మిథ్యావాదమును దూరీకరింపజాలు సునీతులు భారతీయులకు అత్యవసరము. అకర్మణ్యావాదము యొక్క కుత్సితనీతులు మనదేశమును తీరని ఆర్థికనష్టమునకు లోనొనరించినవి. నేడు పాశ్చాత్యదేశములకు - ప్రాచ్యదేశమునకు ఆర్థికాదాయమునగల వ్యత్యాసమునుబరికింపుడు. నేడు ప్రపంచమునగల దేశము లన్నిటిలో అమెరికా మిక్కిలి భాగ్యవంతమైనది. అందుగల ప్రతి వ్యక్తియొక్క రాష్ట్రీయాదాయము సంవత్సరమునకు రు 1070 లు, ఆస్ట్రేలియాయందు రు 810 లు, బ్రిటను దేశమునందు రు 750 లు, కనడాయందు రు 650 లు, ఫ్రాన్సునందు రు 570 లు, జర్మనీనందు రు 450 లు, భారతీయుల సంవత్సరాదాయము రు 45 లు మాత్రమే.

సోదరీ! మన ఈ ఆర్థిక హీనతకు పర ప్రభుత్వము, జగన్మిథ్యావాదములే మూలకారణము. ఇట్టి మనోవృత్తి మారిన గాని మన జాతికి పునరభివృద్ధి కలుగబోదు. భగవత్ప్రసాదితమగు పదార్థమును భ్రమచే మిథ్యయను

కొనక దాని నెట్లుపభోగింపవలయునో ఉపనిషదాది సచ్ఛాస్త్రములు మృదుమధురముగ బోధించుచున్నవి. ఉపనిషత్తులు ప్రేయోమార్గమును నిందింపవు. అవి శ్రేయోమార్గమును సమ్యక్కుగ ననుష్ఠించుటకయి ప్రేయోమార్గాశ్రయము అనివార్యమని చెప్పుచున్నవి. పారలౌకిక సిద్ధి ఐహికసిద్ధిపయి నాధారపడి యున్నదని వాని మతము. కావున ఐహికము సిద్ధింపవలయునన్న మానవుడు పురుషార్థప్రవణుడై ధర్మమార్గముతో ధనమును సంపాదించి, దానిని సంరక్షించుకొనవలయును; ఉపభోగించుకొనవలయును. "శతహస్త సమాహర సహస్రహస్త సంకిర" "నూరు చేతులతో ధనమును సంగ్రహింపుము. వెయ్యి చేతులతో ధర్మకార్యమున దానిని వినియోగింపు" అని ఈ వేదమున్కుకు నర్థము. కావున అర్థతత్త్వమును గుర్తెరిగి దానిని సక్రమమార్గమున సంపాదింపవలయునదేది ఆదర్శమును ముందిడి కొన్న మానవుడే చరితార్థుడగును.

## ఐశ్వర్య రుచి

భారతీయార్య సంస్కృతిలో మోక్షమునకు వలెనే ధనమునకును ప్రాధాన్యము కలదు. అర్థము యొక్క పర్యాయపదమే సంపద. అర్థము మోక్షసిద్ధికి ప్రధాన సాధకము. అర్థసిద్ధి లేనిది మానవునకు మోక్షము సిద్ధింపబోదు. ఆత్మకు మోక్షమువలె, అభివృద్ధికి ధర్మమువలె, మనమునకు క్రియాకలాపమువలె, శరీరమునకు ధన మత్యావశ్యకము. ధర్మ - మోక్షములు మానవునకే ఆవశ్యకములు; కాని అర్థ కామ

ములు సృష్టిగల సమస్త ప్రాణులకును సమానావశ్యకములు. కామోపభోగము లేకపోయినను మున్ను సంభవింపదు. కాని సంపత్తులేనిది సృష్టి కార్యక్రమము అడుగేనియు ముందునకు సాగదు. కావున ధర్మార్థకామమోక్షము లను చతుర్విధ పురుషార్థములలో అర్థము ప్రధానతమమని నుడు వక తప్పదు. అట్లగుట ధనసంపాదనా మీమాంస మిక్కిలి సావధానముతో చేయుట లెస్స. అధర్మముగ ధనము సంపా దించినను, ధర్మోపార్జితమును దుర్వ్యయ మొనరించినను మానవుని ఆత్మాభివృద్ధి నిరుద్ధమయి చరమ లక్ష్యమగు మోక్షమార్గము మూతవడిపోవును. ఆర్యులు అర్థమహాత్మ్య మును బాగుగా నెరిగియుంట దీనివిషయమై నిష్పాక్షికము గను, ఔదార్యముగను ఆలోచించిరి.

"సర్వేషామేవ శౌచానా మర్థశౌచం పరంస్మృతమ్"

అను నీ మనుస్మృతి శ్లోకార్థమే దానికి ప్రమాణము. సమస్త పావిత్ర్యములలో అర్థ పావిత్ర్యమే సర్వశ్రేష్ఠము. కావున నిట్టి పవిత్రమగు ధనమును ఆర్జించుతరి జీవహింస కలుగకుండ ధర్మానపేతమగు మార్గము నవలంబించి, శారీరక క్లేశముల దరి జేరనీక, నీచకర్మలపొంత పోక, తన కుటుంబ పోషణమునకు వలసిన ధనమును మాత్రమే సంపాదింప వలయును. కాని గర్హ్యములగు నీచకర్మల సాధనములుగా గాని బీదజనుల నోరుగట్టి అధర్మమార్గముల ధనము సంపా దించుట మహానర్థకరమేగాక అయ్యది వానిని తీవ్రయాత నలకు లోనుజేయును. అర్థమును సంపాదించుతరి స్వాధ్యాయ మునకు భంగము వాటిల్లరాదు. అన్యుల సొత్తుపయి ఆధార

పడియుండరాదు. ఇట్లు సంపాదించిన ధనమే పవిత్రమయినది. ఈ అర్థ పవిత్రతయే పరమునగూడ మానవునకు మేలును చేకూర్పకలదు. సృష్టిలో పరమాత్మ లీలావిలాసములను సదా సర్వత్ర పరికించుచు, ఇతరుల సొత్తుల కాసింపక పరమాత్మ దత్తమును, పురుషార్థ సంపాదితము నగు సంపదలను మాత్రమే సంతోషముతో అనుభవింపుమని వేదములు నుడువుచున్నవి. ఆ జీవనమిట్లు పరులపై నాధారపడక పురుషార్థ ప్రేరితుడయినవాడు మోక్షమునకు మిక్కిలి సన్నిహితుడు. సృష్టిలోగల సర్వప్రాణులకు జీవధారణమునకయినను సంపద అవసరము కావున అంటనదిగదా అని తెగబడి సర్వస్వము నపహరింపక తనకు తగుమాత్రమే స్వీకరించుట వివేక లక్షణము. విశ్వమున మనుష్య భిన్నములగు సర్వప్రాణులకు సంపదలో నొకభాగమగు ఆహార-గృహములు మాత్రమే అవసరము. అందును కొన్ని ప్రాణులకు ఆహారము తక్క వేరేదియు నవసరములేదు. కాని మానవునికి భోజన-వస్త్ర గృహాదులు అవసరము. ఈ పదార్థముల యొక్క సౌందర్యము సాత్విక సారళ్య పవిత్రతలపై ఆధారపడి యున్నది. కావున వీని తత్వము నెరిగి మానవలోకము మెలగవలయును.

## సుఖోత్పత్తి

సుఖదాయినీ! సృష్టిలోగల ప్రాణులన్నియు నేదో ఒక విధముగ తాము సుఖమును వాంఛించుచున్నవి. స్వస్థేంద్రియములకే సుఖమని పేరు. సుఖోపలబ్ధికయి మానవున కొసంగిన ఇంద్రియజాలమును నీరోగ మొనరించి, స్వాధికా

రమునకుం దెచ్చుకొని, ఆనందోపలబ్ధికయి గార్హస్థ్యమునగల స్త్రీపురుషులు ప్రయత్నింపవలయును. కష్టముల జయించి తాబట్టినపట్టు వీడక సుఖసిద్ధిని బడసి బ్రహ్మానందము ననుభవించుట స్త్రీపురుషుల కర్తవ్యము.

**ఋత్వానుకూల్యము :—** యజ్ఞాది కర్తవ్య కర్మల నొనరించుటచే, ఋత్వానుకూల్య మేర్పడును గావున గృహమేధులెల్లరు ద్విసంధ్యలందును విస్మరింపక అగ్నిహోత్ర కార్యములను నిర్వర్తింపవలయును.

## పరస్పర మైత్రి

"గార్హస్థ్య జీవనులు సృష్టిలోగల జంతుజాలముతో ప్రేమపరీత భావమున మైత్రిని సంపాదింపవలయును. ప్రతి ప్రాణిని మిత్రదృష్టితో వీక్షింపవలయును. నయనములు సదా ప్రేమ విహ్వలములు కావలయును. ఎటు చూచినను వారికి పవిత్రప్రేమయే దృగ్గోచరము కావలయును." అని వేదములు చెప్పుచున్నవి. పవిత్రమగు నీ వేదోపదేశమును గృహమేధులు తమ జీవనలక్ష్యమునుగా పెట్టుకొనవలయును.

సోదరీ! నేనింతవరకు గార్హస్థ్య జీవనమును శ్రేష్ఠతమ మొనరించుటగు తగిన కతిపయ విషయములను వినిపించితిని. ఇటనుండి గార్హస్థ్య జీవనసంస్కారమునకు మిక్కిలి తోడుపడు విషయములను కొంతతడవు చర్చింతును. అవియే యజ్ఞములు. గార్హస్థ్యజీవితము యజ్ఞమయము కావలయును. నైత్యికములు—నైమిత్తికములు నని అవి రెండు తెరగులు;

ఈ యజ్ఞములను గార్హస్థ్యమవలంబించిన స్త్రీ పురుషు లెల్లరు నిత్యమును విడువక చేయుట వారి ధర్మము. దీని వలన వ్యక్తిగత సామాజిక జీవితముల రెంటను స్థైర్యమేర్పడును; కావున క్రమముగ నైత్యిక యజ్ఞములను బోధపరతును.

బ్రహ్మయజ్ఞము, దేవయజ్ఞము, పితృయజ్ఞము, భూత యజ్ఞము, అతిథి యజ్ఞము నని ఇవి యైదువిధములు. వీనిలో బ్రహ్మయజ్ఞము మొదటిది.

## యజ్ఞములు

బ్రహ్మయజ్ఞము :— యజ్ఞమయజీవితే! ప్రాతస్సా యం సంధ్యల చేయబడు "సంధ్య" కు బ్రహ్మయజ్ఞమని పేరు. సంధ్యనొనరించుట మిక్కిలి అవసరము, ఉపయోగకరము నగు అనుష్ఠానములలో నియ్యది ముఖ్యతమము. సదా విడు వక సంధ్య నొనరించు మానవునకు ఇరుగుపొరుగువారి విష యమై ఎట్లు ప్రవర్తింపవలయునో, ఈశ్వరుని యెడ వాని కర్తవ్యమేదియో బోధపడును. మానవుడు బ్రహ్మయజ్ఞము ద్వారా తన జీవితమును చరితార్థమొనరించుకొనజాలును.

దేవయజ్ఞము:— గృహకృత్యముల నిర్వర్తించుచు పరమాత్మ ప్రసాదితములగు వస్తువులను సతతము పరిశుద్ధ పరతుము. అట్లే మలపురీష విసర్జనములచే పృథివిని దూషిత మొనరింతుము. స్నానముచే జలమును కశ్మలమొనరింతుము. ఇట్లే ఎన్నియో పదార్థములను మన మపవిత్ర మొనరించు చున్నాము. పృథివ్యాదులు దివ్యగుణోపేతములు కావున వీని

నపవిత్ర పరచుటచే మానవుడు దేవతలకు ఋణపడినవాడగును. ఈఋణమును తీర్చుటకు ఏవైన పవిత్రకార్యముల నొనరింపవలయును. యజ్ఞములే ఇట్టి పవిత్రకార్యములు. వీనిలో దేవయజ్ఞము అత్యంతావశ్యకమేగాక మిక్కిలి ఉపయోగకరమయినది. ప్రతిగృహస్థునను హవనము నియమపూర్వకముగ జరుగుచుండవలయును. దీనిచే గృహస్థుని ధార్మికత్వము అభివృద్ధిగాంచి, వాని జీవనము ఉత్తమోత్తమమై వెలారును. హవనముచేయు వానిని అంటురోగము లెన్నడును దరిజేరరావు. జలవాయ్వాది పంచభూతములను పరిశుద్ధపరచి ప్రాణికోటికి నీరోగమును ప్రసాదింపవలయు నన్న బ్రహ్మయజ్ఞమును మించిన వేరొండుసాధనము లేదు. ఇట్టి సాధనము నూతగాగొని తమ జీవితమును సఫలపరచుకొనుట ఆర్యగృహస్థులకు విహితకర్తవ్యము.

**పితృయజ్ఞము :—** జీవితులగు తలిదండ్రులయు, గురుజనులయు సేవాసత్కారముల నొనరించుటయే పితృయజ్ఞము. దీని యనుష్ఠానముచే గృహస్థాశ్రమమునగల స్త్రీపురుషులకు ప్రసన్నత చేకూరి వారి గార్హస్థ్యజీవనము సుఖాలవాలమగును. ఆర్యమహిళామతల్లులెల్లరు తమ సంతానమునకు పెద్దలపొడగన్న అభివాదన మొనరించుపద్ధతిని నేర్పవలయును. తలిదండ్రుల ప్రబోధానుసారము వినయభావముతో పెద్దలకు నమస్కరించు వానిని గాంచినపుడు ఎవ్వానిహృదయము ఆనందతరంగితము కాకయుండును ? అట్లు పెద్దల మన్ననలకు పాత్రుడయిన పుత్రుని గాంచినపుడు వాని తలిదండ్రుల సంతోషమునకును మేరయుండదు. వారి సంతోషముగాంచి గృహమునగల తక్కుంగలవారును

ప్రసన్నులయ్యెదరు. ఇట్లు తమ జీవితపితరులకు సంతోషము చేకూర్చుటయే పితృయజ్ఞము. కాని పవిత్రమగు నీ పితృ యజ్ఞ శబ్దమునకు విపరీతార్థమును కల్పించి, చనిపోయిన తలిదండ్రులకు జలతర్పణముల నీయవలెనని కుక్షింభరులగు వంచకులు కొందరు సాధులోకమును మోసగించుచున్నారు.

వివేకవతీ! పితృయజ్ఞమును గూర్చిన ఒకానొక ఆ ఖ్యాయికను నీకు శ్రుతపరతును. సిక్కుల తొలిగురువగు నానకు ఒకప్పుడు గయ కేగియుండెను. అట వేలకొలది స్త్రీ పురుషులు మృతులగు తమ పితరులకు జల తర్పణముల నిచ్చుచుండుట చూచెను. వారి అజ్ఞాన కృత్యమునకు విస్మయమంది ప్రతివిధానమున వారికి నీతిప్రబోధము కావింప నెంచి తానును నదిలో దిగి తమ గ్రామము దిక్కునకు జలముల ప్రోక్షింపసాగెను. ఈ వింతనుజూచి ప్రక్కవా రిది యేమని ప్రశ్నింప, మా గ్రామమున నొక ఉద్యానవనమును నాటితిని. అది ఆతపశుష్కమైపోవునేమో అను భయమున నీపని గావించుచుంటినని అతడు సమాధానించెను. మీ గ్రామమెచ్చట – ఈ నీరు చేరుటెచ్చట ఇదెట్లు సంభవ మగునని చేయుచుంటివని వారు పరిహాసింపగా, మృతినొందిన పితరులకు మీరిచ్చు జలములు చేరిన మా గ్రామమున కీ నీరు చేరకపోవునా అని మారుపలికి వారికి జ్ఞానోదయమును కలిగించెను.

వాస్తవముగ పితృయజ్ఞమన మృతులగు పితరులకు జలాదుల నిడుటగాదు; సజీవులగు తలిదండ్రుల సేవా శుశ్రూషలచే సంతృప్తి పరచుటయే.

**బలివైశ్వ దేవము :—** గృహస్థుడు నిత్యము కీటాది వివిధ జంతువులను హింసించుచుండును; గావున వాని కియ్యది ప్రాయశ్చిత్త మాత్రము. ప్రతిదినము గృహస్థుడు అనాథజీవ జాలమును అన్నదానముచే సంతృప్తి పరుపవలయును. ఇదియే బలివైశ్వదేవ యజ్ఞముయొక్క అతిసంక్షేపముగు స్వరూపము.

**అతిథి యజ్ఞము :—** పాండిత్యము, ధార్మికత్వము, పరోపకార పరాయణత్వము, సదుపదేశికత్వము అనునవి అతిథి లక్షణములు. ఇట్టి లక్షణ లక్షితుడగు అతిథి ముఖ్య కర్తవ్యము గృహస్థులలో సత్య ప్రచార మొనరించుటయే. అత డెన్నడును తాను వచ్చెడి తిథి నేరికిని తెలియజేయడు. కావున నిట్టి అతిథిని ఆసన మధుపర్కాది ప్రదానముచే సత్కరించుట ఆర్యుల విశిష్టాచారము. గృహస్థులు నిత్యము పవిత్రమగు నీ అతిథి యజ్ఞమును నిర్వర్తింపవలయును. అతిథి యజ్ఞానుష్ఠానముచే వ్యక్తి, సమాజ, దేశముల ప్రతిష్ఠలు దిగంతములవరకు ప్రతిష్ఠితములయి, ఆచంద్రతారార్కము వెలారును.

నైమిత్తిక యజ్ఞములు పర్వదినములలో గావింపబడును.

## సంస్కారములు

గార్హస్థ్యముచే సంతానము ప్రాదుర్భవించును. సంతానము ఈ సంస్కారములచే సుసంస్కృతమై ఉత్తమత్వమును పొందును. మొత్తము సంస్కారములు పదునారు. గర్భాధానము, పుంసవనము, సీమంతోన్నయనము, జాతకర్మ

నామకరణము, నిష్క్రమణము, అన్నప్రాశనము, చూడా కర్మ, కర్ణవేధము, ఉపనయనము, వేదారంభము, సమావర్తనము, వివాహము, వానప్రస్థము, సన్యాసము, అంత్యేష్టి యని వీని నామములు.

గర్భాధానము :— ఉత్తమ సంతానోత్పాదనమునకై గర్భాధాన సంస్కారము ప్రారంభింపబడును. ఇరువదియైదు వత్సరములు గడచిన పురుషునకు పదునారు వత్సరములు మించిన కన్యకకు నీ సంస్కారము తగును. ఈ సంస్కారము రజోదర్శన సమయమున చేయరాదు.

పుంసవనము :— గర్భసంరక్షణమున కయి మూడవ మాసమున ఈ సంస్కారము చేయబడును. ఈ సంస్కారము చేయుతరి భార్యాభర్తలు గర్భస్రావభీతిని గల్పించు నింద్య కర్మ నొనరింపమని ప్రతిజ్ఞ చేయవలయును.

సీమంతోన్నయనము :— ఈ సంస్కారము నాల్గవ మాసమున గర్భమునగల పిండముయొక్క మానసిక శక్తులు వికసించుటకయి చేయబడును. ఇట్టితరి వివిధవస్తు ప్రదానముచే గర్భవతికి సంతోషము గూర్పవలయును.

జాతకర్మ :— ఈయది శిశువుదయించిన తోడనే చేయబడును. శిశువుతండ్రి వాని జిహ్వాగ్రమున సువర్ణ శలాకచే మధు ఘృతముల ఓంకారమును విలిఖించును. 'వేదోఽసి' అను శబ్దమును వాని శ్రవణపుటముల తాకునట్లు వినిపించును.

**నామకరణము :—** శిశువుదయించిన 11 వ దినమున గాని - నూట ఒకటవ దినమునగాని, ద్వితీయవర్ష ప్రారంభమున గాని యీ సంస్కారము వానికి చేయబడును. అది ప్రియమైనదిగను, సార్థకమైనదిగను అయి యుండవలయును.

**నిష్క్రమణము :—** ఈసంస్కారము శిశువుదయించిన నాల్గవ నెలలో జన్మతిథియందు చేయబడును. దీని ఉద్దేశము శిశువుచే ఉద్యానమున గల పరిశుద్ధ వాయుసేవనము ద్వారా సృష్ట్యవలోకనమును చేయించుటయే.

**అన్నప్రాశనము:—** శిశువునకు అన్నమును జీర్ణించుకొనగల శక్తి ఏర్పడిన ఆరవమాసముననో, ఎనిమిదియవ మాసముననో ఈ సంస్కారము చేయబడును.

**చూడాకర్మ :—** మూడవ వర్షమున బాల బాలికల కేశములు ఖండించుటకు చూడాకర్మ సంస్కారము ప్రారంభింపబడును.

**కర్ణ వేధము :—** శరీరమునగల రోగముల దూరీకరించుటకు బాలకుని చెవులు పొడిపింతురు. ఈ సంస్కారము మూడవ వర్షమున లేక అయిదవ వర్షమున చేయబడును.

**ఉపనయనము :—** ఏడవ సంవత్సరమున యజ్ఞోపవీతమును బాల బాలికలకు ధరింపజేయవలెను.

**వేదారంభము :—** ఉపనయన సంస్కారమునకు పూర్వము గురుకులమున గాయత్రీ మంత్రముచే వేదారంభము చేయబడును.

**సమావర్తనము :—** వేదశాస్త్రములు సాంగముగ నభ్యసించి బ్రహ్మచర్యవ్రత పరిపాలనానంతరము గురుణానుమతుడై గురుకులమును వీడి గృహస్థాశ్రమమున ప్రవేశించుటకు సమావర్తన మని పేరు.

**వివాహసంస్కారము :—** విద్యాధ్యయనానంతరము తమ గృహముల కేగుదెంచిన పుత్రీపుత్రుల కీసంస్కారము చేయబడును. యోగ్యులయిన స్త్రీ పురుషులకు మాత్రమే ఈసంస్కారార్హత గలదు.

**వానప్రస్థము :—** తమ జ్యేష్ఠపుత్రునకు పుత్రోదయ మయినపిమ్మట గృహమును వీడి వనుల కేగుటకై గృహస్థుని కీ సంస్కారము చేయబడును.

**సన్యాసము :—** వానప్రస్థమున ఇంద్రియములు జయించినవాడు పరోపకృతికయి సన్యాసమును స్వీకరింపవలయును.

**అంత్యేష్టి :—** ఈయది మానవశరీరమునకు అంతిమ సంస్కారము. శవదహనమునకే "అంత్యేష్టి" యని పేరు.

## వర్ణవ్యవస్థ

సత్క్రమ పరిపాలనమునకై గార్హస్థ్యము చౌపాళ్ళుగా విభక్తమయినది. వానినే వర్ణము లందురు. అవి గుణకర్మ ప్రవృత్తములు. గృహస్థుని వీడి తక్కుంగల బ్రహ్మచారి, వానప్రస్థ, సన్యాసులకు ఏవర్ణములునుండవు. గృహస్థాశ్రమ

సంబద్ధములగు ఈ నాలుగు వర్ణములు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులను పేరులచే పిలువబడుచున్నవి. వర్ణవిభాగము జన్మచే నేర్పడునది గాదు. ప్రస్తుతము భారతవర్షమున ప్రచలితములయి యున్న వర్ణములు అన్వర్థకములు గావు. కఠిన బ్రహ్మచర్యమును పరిపాలించి, విద్యా, సఖ్యతా, సదాచారముల నలవరచుకొన్నవాడే బ్రాహ్మణుడు. ఇట్టి గుణములు లేనివారెల్లరు శూద్రులు.

**చాతుర్వర్ణ్య కర్తవ్యములు:—** మనువు తన స్మృతి యందు ఉపవర్ణించిన చాతుర్వర్ణ్యముల కర్తవ్యములు లౌకిక, పారలౌకికములని రెండుగా విభజింపబడెను. వేదాధ్యాపనము, యజ్ఞకరణము, దానపరిగ్రహములు బ్రాహ్మణుని లౌకిక కర్తవ్యములు.

సర్వవిధ సేవాభావముచే దేశమును సంరక్షించుట క్షత్రియుని లౌకిక కర్తవ్యము. కృషి వ్యాపార పశు సంరక్షణములు వైశ్యుని లౌకిక కర్తవ్యములు. శారీరక సేవా శుశ్రూషాది పరిశ్రమల నొనరించుట శూద్రుల లౌకిక కర్తవ్యము. వేదాధ్యయన, యజ్ఞకరణ, దానములు మూడును ఈ నలుగురి పారలౌకిక కర్తవ్యములు. వేదపఠనాధికారము అగ్రవర్ణములవారితోపాటు శూద్రునకు లేదని కొందరు నితండులు వాదింతురుగాని అది కేవల వేదశాస్త్రవిరుద్ధమును, సంప్రదాయభిన్నము నగు సంగతి.

# స్త్రీవిద్య

"చదువన్ నేర్తురు పూరుషుల్ బలెనె శాస్త్రంబుల్ పఠింపించుచో
నదమన్ నేర్తురు శత్రుసేనల ధనుర్వ్యాపారముల్ నేర్పుచో
నుదితోత్సాహముతోడ నేలగలరీ యుర్విం బ్రతిష్ఠించుచో
ముదితల్ నేర్వఁగరాని విద్దెగలదే ముద్దార నేర్పించినన్."

ప్రజ్ఞావతీ! ఇప్పటికి దరిదాపు ఏడునందల వత్సరముల నుండి మన భారతవర్షము పరుల పాదాక్రాంతమయి, పారతంత్ర్యమున వసివాళ్వాడి అవసిపోవుచున్నది. ఆర్య నాగరికతా దీధితులు తేజోవినష్టములయినవి. విశ్వశ్రేయో కళ్యాణములకు మార్గప్రదర్శకములకు భావవికాస రేఖలు దాస్యమున జిక్కి హృదయకుహరముల కావిరిగ్రమ్మి పోయినవి. పరరాజులకు సింహస్వప్నాయమానమగు బల పరాక్రమాతిశయములు స్వేచ్ఛాస్వాతంత్ర్యముల గోలుపోయి, పరులపాదములకు ప్రణమిల్లి పూజోపహారము లగుచున్నవి. అహో! పావన భారతావని కెట్టి దురవస్థ!

ప్రస్తుతము మన భారతీయుల మనఃప్రవృత్తి ఒక ఆదర్శము, ఒక లక్ష్యము లేక గమ్యస్థానమును జేరలేక మార్గమధ్యమమున కుంటువడిపోవుచున్నది. అవసరములు - ఆవశ్యకములగు వాని ఆర్జించుకొనలేక మృగతృష్ణికలకు చేతులు చాచుచున్నది. సర్వదా సర్వథా భారతీయుల హృదయములు అవశములై, దుర్బలములై నీచోచ్ఛభావ తరంగ సంఘర్షణమున నలుగుచు వడుచున్నవి. కావుననే మనవారు నేటికిని స్త్రీవిద్యా సమస్యపై వైముఖ్యము చూపుచున్నారు.

ఇదియెంతయు అసమంజసము-అసహనీయమునగు వక్ర వైఖరి. వారీ సమస్యను ఏకారణమున కాదందురోకూడ కానలేక పోవుచున్నాము. ప్రజ్ఞా ప్రతిభలు వారికి కలవనియా! కాదు, కాదు, ఈ పై పద్యము గాంచుడు. అట్టి సందేహము ఏ మానవుని మానస వీధినైన పొడగట్టునా! కాక పూర్వచరిత్రములను గాని, మధ్యకాలీన చరిత్రలగాని సమగ్రముగ పరిశోధించినవారికి సీతా - సావిత్రి - సత్యభామాదుల వృత్తాంతము వలనగాని, అహల్యా, దుర్గ, ఝాన్సీ మొదలగు వీరనారీమణుల ప్రచండ పరాక్రమ తాండవ నృత్యముల వలనగాని ఆ సందేహము నిశ్శేషమగును గదా! మానవతీమణీ! మగవారు మిమ్ము అసమర్థులని తలచికాదు మిమ్మట్లు విద్యా వివేకముల పొంతకు పోనీక బంధించుట. మీకును నట్టి విషయముల ప్రవేశము - పరిచయము చిక్కిన తమ పెద్దరికమున కెచ్చట భంగము వచ్చిపోవునేమో అను బెంగయే! స్వార్థమే! దానికి కారణము. కాని వేరేమియుకాదు. మానవత్వ దృష్టితో పరీక్షించిన స్త్రీ పురుషు లిరువురును విద్యాది సత్కార్య గ్రహణమున సమానులే. వాస్తవముగ ఒకే ఆత్మజ్యోతికి చెందిన ద్వివిధ దివ్యప్రకాశములు; కాని వారి కార్య క్షేత్రములగు ప్రకృతి ధర్మములుమాత్రము భిన్న భిన్నములగుట యథార్థము; కాని యీ భేదమువలన వారి అధ్యయనాదులకు అడ్డు చెప్పుట సరసము - సమంజసమును కానేరదు. సమగ్రముగ విద్యాధ్యయన మొనరించి, సమర్థము చరితార్థము నగు పితృత్వమును పొందుట పురుషుని కర్తవ్యము. అట్లె

సంపూర్ణముగ విద్యాబలములను వెనుదివియక గడించి, తన దివ్య మాతృత్వమును సర్వోన్నతి మొనరించి లోకోద్ధరణము గావించుట స్త్రీలకు విహితము, ఆవశ్యకము నగు కర్తవ్యము. గార్హస్థ్య రథమునకు స్త్రీపురుషు లిరువురు రెండు చక్రములు. ఇరువురును సమానభాగస్వాములు కావున ఎవరి ధర్మమును వారు సమగ్రముగ - సమర్థముగ నిర్వహించుకొనజాలక పోయినచో గార్హస్థ్యము నిమ్నోన్నతమయి కష్టనష్ట సంకుల మగు పథమునకు పోవును. అగుట నిరువురును విద్యాబల సంపన్నులై స్వధర్మక్రియా నిర్వహణమునకు చాలిన సమర్థులు కావలయునన్న విద్యాధ్యయనము తప్పనిసరి యగుచున్నది.

నేటి మన వైదేశిక ప్రభుత్వము గరపుచున్న విద్యా విధాన మెంతయు దూష్యముగ నున్నది. ఇది మన శక్తి - సామర్థ్యములను, జ్ఞాన-వివేకములను వికసింపజేయ నేరదు. ఇందుగల దోషము ప్రాథమిక - మాధ్యమిక శిక్షాల యములకు చోటీయక ప్రారంభమునుండియు ఉన్నత విద్యాలయములను అమలున బెట్టుటయే. దీనివలన స్త్రీవిద్య మరింత అడుగంటిపోవు చున్నది. నేడు మన ప్రభుత్వ విద్యాలయములందు గరపుచున్న విద్యావిధానము ముఖ్యముగ స్త్రీలకు అనర్హమును, అప్రయోజకము నగుచున్నది. ఇది ఆర్థికముగను, మానసికముగను, శారీరకముగను స్త్రీలను అధఃపాతాళమునకు గూల్చుచున్నది. కావున ఈ విద్యా విధానమునుండి ఎట్లయినను విడివడజేసి, మన ఆర్షసంప్రదా యానుసారము స్త్రీలకు విద్యగరపుట లెస్స. విదేశీయ వేషభాషలలో పరిపక్వస్థితిని సంపాదించుకొనవలసిన అవస

రము మన పాదరీమణులకు లేదు. మన బాలికలు శాస్త్రము, మాతృభాష, గృహవిజ్ఞానము, ఆరోగ్యశాస్త్రము, సంగీతము, గణితము, దేశ-విదేశీయ చరిత్ర, వ్యాయామము, మనోజ్ఞ కళలు అధ్యయనించిన చాలును. దీనివలన గలిగిన జ్ఞానసారమును వీరి గార్హస్థ్య జీవనమును సుఖశాంతిమయము గావించి, ఆదర్శముగ వెలయింపగలదు.

## అంతర్జాతీయ వివాహములు

ఈ అంతర్జాతీయ వివాహములను ప్రాచీన వైదిక సాహిత్యము వెనుకీయక ప్రోత్సహించుచున్నది. వీని పైననె వ్యక్తి-సమాజ, దేశకళ్యాణములు నిహితమై యున్నవి. పౌరాణిక వర్ణవ్యవస్థను దూరీకరించి, వైదికవర్ణ వ్యవస్థా ప్రణాళికను స్థాపింపజాలువానిలో అంతర్జాతీయ వివాహములు ముఖ్యతమములు. జాతి-సమాజములకు సత్తమ సంతానము నర్పించుటయే వివాహమునకు ముఖ్యోద్దేశము, ప్రధాన సంకల్పమునై యున్నది. కావున సమానవర్ణ గుణ కర్మస్వభావములుగల స్త్రీపురుషుల పరస్పర సంబంధమత్యావశ్యకము. ఇవి అంతర్జాతీయ వివాహములులేక సిద్ధించుట దుర్లభము. అనగా వైవాహిక క్షేత్రము విశాలము, వికాసముగ నుండవలెను. నేడు మనదేశమున మిక్కిలి ప్రచార వ్యాప్తిలోనున్న బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర వర్ణములు జన్మజాతమగు వర్ణవ్యవస్థ నాశ్రయించియున్నట్లు చెప్పబడుచున్నవి. కావున నివి కృత్రిమములనక తప్పదు. స్వస్వవర్ణములందె, స్వజాతులయందె పరస్పరము వివాహములు పొసగుటవలన మనఃప్రవృత్తి ఆర్థిక సామాజిక వ్యవస్థలకు తీరని

నష్టము కలిగించుచున్నది. ఈ నిబంధనముచే యోగ్యులెందరో అయోగ్యుల పాలబడి, తన జీవితసుఖములను గొంతుగోసి త్రుంచివేయుచుకొనుచున్నారు. అనధికారులు కట్టుబాటులేక విచ్చలవిడిగ వివాహములు చేసికొనుచున్నారు. వీని ఫలితముగ మూర్ఖులు, నపుంసకులు, బధిరాంధులు విస్తారముగ తయారగుచున్నారు. ఇది యంతయు అంతర్జాతీయ వివాహములు అమలునలేనందున కలిగిన దుష్టపరిణామములు. ప్రస్తుతము మన దేశమున కొన్ని జాతులలో స్త్రీల సంఖ్య అధికము. తక్కింగలవారిలో పురుషులసంఖ్య హెచ్చు. ఈ కారణమున కన్యావరశుల్కములు మితిమీరి గృహమేధులను కలవర పెట్టుచున్నవి. అనార్యములు, అతి దుర్భరములునగు నీ వరశుల్కములనైనను రూపుమాపి, సంఘశ్రేయస్సు గూర్చుటకయినను అంతర్జాతీయ వివాహములను ఆచరణమున నుంచుట మేలు. ఇవియు వధూవరుల గుణకర్మ స్వభావములను వైదిక వివాహాసరణులను ఆధారము గొనియుండవలయును. ఈ విధానమున సత్సంతానములు విస్తరించి, సమాజ దేశమును నిత్యకళ్యాణములు - పచ్చతోరణములతో విలసిల్లునుగాక. నీ భావిసంతానము ఈ అంతర్జాతీయ సమస్యను సుముఖమగునట్లు సంస్కరించి, వారినే లక్ష్యభూతులను గావించి, దీని నిరంతర ప్రచార వ్యాప్తికి దోహదమొసగి [illegible]

ఆర్యగృహిణీ! [illegible] సుముఖ[illegible] సర్వాంగశః అనుభూతపూర్వమగు ; ప్రస్తావ[illegible] [illegible] [illegible]

ఈ తరుణవరుని పాణిగ్రహించి, గార్హస్థ్యమున తొలిగ నడుగిడుచుంటివి. ఇది నీకు క్రొంగ్రొత్త; అయినను ఇందలి రహస్యములు, ధర్మ మర్మములు కొన్నిటి నిపుడే వినియుంటివి కాని విషయజ్ఞానము క్రియాసాహచర్యము లేక శోభిల నేరదు; కావున ఇందలి కరణీయ లీలామర్మములకు నీ మధుర దాంపత్యజీవన సరణితో క్రియారూపమున జీవముపోసి, సాటి ఇల్లాండ్రకు మేలుబంతి వగుము; పరమ పితృకటాక్షాంచలముల సకల సౌభాగ్యముల బ్రాపించి, సత్సంపన్నులగు పుత్రపౌత్రులబడసి, కలకాలము గార్హస్థ్యమును సౌఖ్యానంద ప్రపూర్ణముగ అనుభవించి, ఆదర్శపదమగు "ఆర్యగృహిణి" పదమును అన్వర్థము గావించి, ధన్యవగుదువు గాక! అని మా ఆకాంక్షితము.

ఇతి శమ్.